# తీయటి మాట

మృదువైన తీయటి మాటలను ప్రేమించుచూ,
గుసగుస లాడు సమయమున వచ్చేడి
దుర్గంధ నాశనమునకు బినాకా యందలి
క్లోరోఫిల్ అభయ మిచ్చుచున్నది.
తదుపరి సంభాషణంతయు తీయగనే యుండును.




CIBA



Roopkala

భారతనారికి పతియే ప్రత్యక్ష దైవం.
ఆమెనమ్మకాన్ని వమ్ముచేసే అధికారం
ఏచట్టానికీ లేదని నిరూపించిన,
పతివ్రతా శిరోమణి పవిత్రగాథకు
సమగ్ర రూపకల్పనమే.

కౌముదీ ఫిలిమ్స

# భార్య

దర్శకత్వం: కె.యస్.ప్రకాశరావు

నిర్మాత: యం.యస్.రెడ్డి

ఆంధ్ర, సీడెడ్: విజయ కంబైన్స్ రిలీజ్

VIJAYA

ప్రచారం: వాణి

# ఉత్తరాలు

## కథలు

9—2—68 సంచిక ముఖచిత్రం ప్రకృతి యొక్క శోభలను వెదజల్లింది.

'చెడి చెల్లెలింటికి వెళ్ళకూడదు' వెళ్ళిన డబ్బు విలువలలో విలువతక్కువ బహుమతులు ఎప్పుడూ బహూకరించకూడదు. దానివలన కల్గే అవమానాన్ని ఏ మానవహృదయం భరించదు. అనే సారాంశాన్ని చక్కగ మలిచారు నయనారా గారు, తమ "గ్రహణం" కథలో.

వి. వి. స్వామి (కరీంనగరం)

* * *

సంక్రాంతి సంచిక సర్వాంగ సుందరముగా నవరసభరితముగ ఉన్నది. యర్రంసెట్టి వర లక్ష్మిగారి "శ్రుతిమించిన అపశ్రుతి" కథానిక బాగున్నది. శ్రీమతి వేదుల శకుంతలగారి "మంచు రిగినవేళ మామత నవ్వింది" కథలు తండ్రి, ఏకమారుల మధ్య ఉండే అనురాగాన్ని, ఒకరిపై కొకరికి అజ్ఞాతంగా ఉండే ఆప్యాయతను కన్నుల కట్టినట్లు రచయిత్రి అభివర్ణించారు.

పి. రాధ (మద్రాసు)

## ముఖచిత్రం

9—2—68 సంచిక చూశాను. కళ్ళు చెదిరాయి. నిజంగా ముఖచిత్రం అత్యంత మనోహరంగా వుంది. ఇంగ్లీషు బుక్స్‌కివుండే ముఖచిత్రంలా వుంది. చాలా ఆకర్షణీయంగా వుంది. అందుకు అభినందిస్తూ అటువంటి ముఖచిత్రాలే 'శ్రీగిరి'గారిచే వేయించి మాకందిస్తారని ఆశిస్తాం.

విశ్వశ్రీ (అనకాపల్లి)

* * *

అసహ్యకరమైన ముఖచిత్రాలతో విసిగివేసారి పోయిన మాకు ఈవారం (9-2-68) ముఖచిత్రం పన్నీటి జల్లులను కురిపించింది. ఇలానే ప్రతివారం ఆకర్షణీయమైన కళ్లను ఆకట్టుకునే చిత్రాలు వేయాలని కోరుతున్నాను. చాలా రోజులకు చక్కని ముఖచిత్రం అందించినందుకు సంపాదకులకు హృదయపూర్వక కృతజ్ఞతాంజలులు.

శెట్టిపల్లి కృష్ణమూర్తి. (అనంతపురం)

* * *

9—2—68 సంచిక శ్రీశేషగిరిరావు గారు వేసిన ముఖచిత్రం చాలా బాగుంది. ముఖచిత్రాలుగ సినీ తారల ఫోటోలు తగ్గించి యిలాంటి చిత్రాలు వేయడం బాగుంటుంది, అందువల్ల చిత్రకారులను కూడ ప్రోత్సహించిన వారవుతారు. పత్రికలో శీర్షికలు, క్రొత్తవ్యాసాలు ఆకర్షణీయంగ ఉంటున్నవి.

వి. భాస్కర్ (పూనా—6)

* * *

9—2—68 ముఖచిత్రం చూసి నేను, నా మిత్రులూ చాల సంతోషపడ్డాము. ఇకనుంచి సినీతారల బొమ్మలు ముద్రించక కళాత్మక దృష్టితో ముఖచిత్రం (ఈసంచికలో వేసినట్లు) ఆకర్షణీయంగ వేయించి చిత్రకారులను పైకి తీసుకువస్తారని ఆశిస్తున్నాను. ముఖచిత్రం బాగ వున్నందుకు శ్రీ శేషగిరిరావుగారికి ధన్యవాదాలు చెప్పక తప్పదు.

గాడేపల్లి నరసింహమూర్తి (రాజమండ్రి)

* * *

ఈ వారం పత్రిక (9—2—68)లో మూడు 'బాగు'లు.

మొదటిది:— వచ్చేది వసంతకాలం అని జ్ఞాపకం చేసేటట్లుగ ఉన్న ముఖచిత్రం బాగుంది.

రెండవది:— ప్రచురితమయిన మూడుకథలు ఒకదానిని మించి మరొకటి బాగున్నాయి.

మూడవది:— మిగిలిన కార్టూనులు ఏమంత బాగోలేవు కాని శ్రీ బాబువేసిన కార్టూను మాత్రం (28 పేజీ) బాగుంది.

శాంతమూర్తి (హైదరాబాద్)

## వ్యాసాలు

9—2—68 సంచికలో "ఆకలి" కథానిక నన్ను బాగా ఆకర్షించింది. ఆకర్షణీయంగా చిత్రించిన శ్రీ పోలాప్రగడ సత్యనారాయణమూర్తిగారికి నాకృతజ్ఞతలు. జీవరాగం సీరియల్ చక్కగ సాగుతుంది. ఆంధ్రపత్రికకు హైలైట్ అయిన శ్రీడాక్టర్ మహీధరనళినీమోహన్‌గారి వ్యాసాలు, ఈమధ్య వేయుటం లేదు. అలాంటి విజ్ఞానాత్మకమైన విషయాలను గూర్చి ప్రచురించితే విద్యార్థి దశలోనున్నవారికి చాలా అనుకూలంగా వుంటుంది. ఆనందంగా కూడ వుంటుంది. ఇప్పటినుండైన తప్పక ప్రచురించగలరని నా అభిప్రాయం....

ఎర్నేని రామారావు (సూర్యాపేట)

* * *

మీ వారపత్రిక 9—2—68 సంచికలో "ఎన్."గారు "కుంజరకోణపురి"అంటే "ఆనెగుండి అని కూడా అంటారు" అని వ్రాసినారు ఆనెగుండి కాదు అది ఆనెగొంది. ఇప్పటికి ఇదే పేరుతో హొసపేట (హంపి) దగ్గర పిలువబడుతుంది.

కుంజరం. ఆనె (ఏను గు తెలుగు) కోణం:గొంది(తె) ఆనె—కన్నడ—ఏనుగు(తె), కోణ—కన్నడ— గొంది (తె).

కె. ఎన్. బాలసుబ్రహ్మణ్యం (మైసూరు)

## న్యూఢిల్లీ లేఖ

19—1—1968 వ తేదీన వెలువడిన ఆంధ్ర పత్రిక న్యూఢిల్లీలేఖలో శ్రీకృష్ణగారు వ్రాస్తూ 'హిందీ దేశంలో ఆంధ్ర, మైసూరు వాళ్లను మద్రాసీ లంటారని చెప్పారు. అంటే మద్రాసు తమిళుల ప్రాముఖ్యము, ఉత్తర భారతంలో హెచ్చుగా గుర్తింపబడుతుందనీ, ఆంధ్ర,మైసూరులకు ఏమాత్రం, గుర్తింపు లేదనీ స్పష్టమౌతున్నది. ఎన్నాళ్లీ అజ్ఞాతవాసం? తెలుగువా

మిమ్ము మురిపించి మరపించేటి
తేట తెలుగుతనపు తియ్యటి కథాచిత్రమిదే!

స్వచ్ఛమైన తెలుగు గ్రామం!
అచ్చమైన తెలుగు కుటుంబం!!
మావిన్వంవేని మనుషుల్లో
విరబూచె సౌరభాలు
మల్లెలకన్నా మధురంగా గుభాళించి
మరు విరజాజుల్లా మిమ్మాకర్షిస్తాయ్.



రామలక్ష్మణుల్లాటి
యిద్దరన్నదమ్ములు!
సీతా ఊర్మిళల్లాటి
యిద్దరు తోడికోడళ్లూ!!

N.T. రామారావు
నటించిన





ఆజెమ్ ఆర్ట్సు

# తల్లిప్రేమ

నిర్మాత: M. ఆజెమ్. దర్శకత్వం: శ్రీకాంత్
రచన: భమిడిపాటి రాధాకృష్ణ
సంగీతం: సుదర్శనం

పూర్ణా
రిలీజ్.

GOTETI CH.E.PRASAD RAO

యొక్క ఉనికినీ, తెలుగు భాషాభివృద్ధినీ గురించి సకల భారతావనిలో చాటి చెప్పగల సమర్థత తెలుగువారికెప్పుడు వస్తుంది? తోటి వారిని చూసైనా నేర్చుకోనని మన తెలుగు వారిని ఏమనాలి?

శివజ్యోతి (కొంకలూరు).

*  *  *

ఈవారం న్యూఢిల్లీ లేఖ చాలా అసహ్యకరముగా, మీ పత్రిక విలువకు తగ్గట్లులేదు. శ్రీకృష్ణగారు ఏమి వ్రాస్తే అవి మీరు ముద్రించవలెనా? లేక యుక్తాయుక్త విచక్షణ చేసి, ముద్రించు హక్కు మీకు లేదా? శ్రీకృష్ణగారు భాషా విషయము వచ్చే సరికి వారికి ఆంగ్లభాషా వ్యామోహము తప్ప మరేమి అక్కరలేదా? వారు దక్షిణాదివారని, ఉత్తరాదివారని, మహమ్మదీయులని, క్రైస్తవులని శిక్కులని, వారి ఇష్టము వచ్చిన రీతిని వ్రాయుచున్నారు. దేశ అఖండత్వము గురించి వారికి ఆలోచనే రాదా? ఇంత సంకుచిత స్వభావులకు, మీ పత్రికలో స్థానమా? హిందీనాదమును బలపరచు ఏ పార్టీవారైనా (కాంగ్రెసు అయినసరే) జనసంఘీయులనే శ్రీకృష్ణగారి భావము. అట్లయిన ఆంగ్లమును సమర్థించు వారందరూ ద్రావిడ మున్నేత్ర కజగంవారేనా? శ్రీ కృష్ణగారు కూడ ఆ పార్టీ సభ్యులా? ఒకసారి దక్షిణాది వారందరూ హిందీ వ్యతిరేకులని వ్రాస్తూ, ఆ వారం లేఖలో "హిందీ పక్షపాతులనబడే ఆంధ్ర, మైసూరు ముఖ్యమంత్రులు" అంటారు. మరి దక్షిణాది వారందరూ ఒకటి ఎట్లా అయినారు (వారి దృష్టిలో).

పి. దక్షిణామూర్తి (అమలాపురం)

*  *  *

ఈమధ్య నా మిత్రులొకరు ఆంధ్రపత్రికలో శ్రీకృష్ణ వ్రాసే 'ఢిల్లీ లేఖ' నా దృష్టికి తెచ్చారు. అది దేశద్రోహకరంగానూ వాస్తవ దూరంగానూ వుంది. ముఖ్యంగా సంక్రాంతి సంచికలో ఆయన వ్రాసిన ప్రతి అక్షరమూ ఆంధ్ర పాఠకులను తప్పుదారిని పట్టించేదిగానే వున్నది. ఇట్టి ఒక్క వ్యక్తి అభిప్రాయానికి, ఆంధ్ర పాఠకులంతా బలికావడం విచారకరం. భాషా వివాదంలో 'హిందీ వారి పశుత్వాన్ని' వర్ణించిన ఈ పెద్దమనిషికి డి. ఎం. కె. వారు రైళ్లను తగలబెట్టడం, జాతీయ జెండాను నేలగూల్చడం కళ్లకు కన్పడలేదా!? కన్పడ్డా మద్రాసులో వున్న మీ ముద్రణాలయానికి ఏం ముప్పు వాటిల్లుతుందోనన్న స్వార్థంతో వారి 'హిందీ వ్యతిరేకోన్మాదాన్ని' సమర్థిస్తున్నారా?? ఇది ఆత్మవంచన కాదా? జాతీయ దృక్పథం అంటే ఇదేనా??

దీనివల్ల ఇహమా? పరమా?

ఎవరికి మేలు కలుగుతుంది?:? ఆలోచించండి హృదయపూర్వకంగా పత్రిక అభివృద్ధిని కాంక్షిస్తూ సం|| క్రాంతి శుభాకాంక్షలతో మీ

శివప్రసాద్ (హైదరాబాద్)

*  *  *

# ఉత్తరాలు

## ఆటలు

2—2—68 సంచికలోని కె. ఆర్. విజయ ముఖచిత్రం మబ్బులచాటునుండి తొంగిచూస్తున్న నిండుచందమామ లాగుంది. ఇంతచక్కని చిత్రాన్ని ప్రచురించిన మీకు మా అభివందనలు.

23వ జాతీయ క్రీడా ప్రదర్శనలు ఈవారం పత్రిక్కి ప్రత్యేక ఆకర్షణ. అం.తే రచయిత నరసింహన్‌గారు "సుత్తి విసురుట", "ఎత్తుగెంతు" మొదలగు అచ్చతెనుగుపదాలు వాడి ఏమ్మల్ని కన్ఫ్యూజ్ చేశారు. సుత్తివిసురుట అంటే "హేమర్ త్రో", అయితే ఎత్తుగెంతులంటే హైజంపేనా? తెలుపగలరు.

చిల్లాసాంబశివరావు, సి.హెచ్. శేషు, (చండీఘర్—3)

* అవును

## కార్టూన్

29 డిశంబరు 67 సంచికలో ప్రచురించిన సదానందగారు వ్రాసిన "జలిపాట" మమ్మల్ని ముగ్ధుల్ని చేసినది. ఈ నిజజీవితంలో ఎదుర్కొన్న సమస్యలని చక్కగా వ్రాసినందుకు వారికి మా అభినందనలు.

డి. అప్పలరాజు ( బండా ముండా )

*  *  *

19—1—1968 సంచికలోని "మై ఫెయిర్ లేడీ" బొమ్మలు వేసినది కర్టూనిస్టు తమ పేరు తెలుపకపోయినా ఆ కార్టూను వేసినది జయదేవ్‌గారు. సంపాదకులు వాతో ఏకీభవిస్తారనుకుంటాను.

గ్రంధి. పార్వతి (మద్రాసు)

## సినిమా

శ్రీ అక్కినేని నాగేశ్వరరావుగారు పద్మశ్రీ బిరుదాంకితులైనందుకు మీ పత్రికద్వారా నా అభినందనలు.

బి. సత్యేశ్వరరావు (కొరాపుట్). ●




# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం : 23—2—'68
శ్రీప్లవంగనామ సం|| మాఘమా|| బహుళ దశమి
సంపుటము : 60 సంచిక : 25

స్థాపితము :
1908

ముఖ్య సంపాదకుడు :
శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు
శివలెంక రాధాకృష్ణ

ఆంధ్రపత్రిక కార్యాలయము
1, తంబుచెట్టి వీధి, మద్రాసు-1

పోస్టుద్వారా

| | |
|---|---|
| సంవత్సర చందా | 26.00 |
| 6 మాసముల చందా | 13.00 |
| 3 మాసముల చందా | 6.50 |


## విషయానుక్రమణిక

ముఖచిత్ర రచన : శ్రీ కె. శేషగిరిరావు.


కథలు :

| | |
|---|---|
| ... మరణం ధ్రువం | — 16 |
| అధికారి | — 32 |
| కాలం కదిలింది | — 48 |

సీరియల్ నవలలు:

| | |
|---|---|
| మూడుముళ్లు | — 24 |
| జీవనరాగం | — 40 |

శీర్షికలు, వ్యాసాలు, సినిమా:

ఉత్తరాలు — 4, ఊమెన్ కార్టూన్ — 5, న్యూఢిల్లీలేఖ — 6, మెదడుకిమేత — 8, భాష-ఘోష ( కార్టూన్ ) — 9, ఒక వారం విపరీతం, మహీధరోక్తులు — 12, భారతీయ అంతర్జాతీయ వాణిజ్య పరిశ్రమల ప్రదర్శన—14, ప్రశ్నావళి—15, లవ్‌కుమారి — 21, వారఫలం — 23, బాలసాహితి — 31, ధర్మపథం — 39, ఇదీదారి, డాక్టర్ కబుర్లు — 45, వంటలు — 46, ధర్మప్రవర్తన, ఆది యోగాలలో వింతలు — 47, చిత్రసమీక్ష—55, సినిమా — 56, సినిమాడైరీ — 58, మీకు తెలుసా ?— 59, పుస్తకాలు — 61, తెలివి తక్కువ తనం ... — 62, ఆటలు— 64.


కాంగ్రెస్
వదిలినవారు
సహాయం చేస్తున్న
మిశ్రమకూటమి


వద్దు మీరు
వెళ్ళొద్దు
సం.వి.ద


చట్టానికన్నా
నేనుపెద్దవాణ్ణే
కాదన్న
మాట!
నంబూద్రి
పాడ్
తిరస్కారానికి
హైకోర్టు
తీర్పు


సహాయాన్నందించే దేశాలకే
సహాయం చేయాల్సి ఉంది
కాబట్టి అభివృద్ధి చెందు
తున్నదేశా కి సహాయ్యాన్ని
నిరాక
రించారు
జాగ్రత్త
సహాయం
సహాయాన్నిచ్చే
ధనికదేశాలు
అభి
వృద్ధి
చెందుతున్న
పేదదేశాలు

## తనకుమాలిన ధర్మానికిపోయి మొదలుచెడే దేశాలు ఉంటాయా?

# సంయుక్తరాజ్యాల సమావేశం లక్ష్యం?

గతవారం, సంయుక్తరాజ్యాల వాణిజ్యాభివృద్ధిని గూర్చి ఒక సమితి ప్రారంభమైంది. దానిని ఘనత వహించిన శ్రీమతి ఇందిరా గాంధీ ఆవిష్కరించారు. ఆవిష్కరిస్తూ ఒక గొప్ప గంభీరోపన్యాసం చేశారు. ఆ ఉపన్యాసంలో ఇదివరకు అభివృద్ధిలో వున్న రాష్ట్రాలు ఏమయితే పాడుతూ వస్తున్నాయో ఆ విషయాలనే వంతపాడటం జరిగింది. సంపదగల రాజ్యాలు, పేదరాజ్యాలు ఎదుర్కొనే సమస్యలు ఎవరికి తెలియనివి కావు. సమాజంలోను, దేశాలలోను పేదరికాన్ని తుడిచిపెట్టాలని కంకణం కట్టుకున్న సోషలిస్టులు వారి శ్రేయాన్ని గుర్తెక్కించుకోనెంచారు. బాగానే వుంది.

ఈ సమావేశానికి ఆతిథ్యమిచ్చినది భారతదేశం. ఆతిథ్యమిచ్చేముందు దక్షిణఆఫ్రికా, పోర్చుగల్ లతోపాటు సోషలిస్టు చెయినా కూడా సమావేశంలో సభ్యులని భారతదేశానికి తెలియదా? ఎందుకు తెలియదు? తెలుసు. అయినా — దక్షిణాఫ్రికా విషయంలో కొందరు సభ్యులతోపాటు 'వాకవుట్'ని ప్రదర్శించింది!

### సమావేశం సాధించే లక్ష్యం?

పాడపయిన పెద్దరోడ్డుమీద ఒక విశ్రాంతి భవనంలా, సంపదని పంచుకోటానికి ఈ సమావేశం ఒక స్థావరం అని రాజకీయ పరిశీలకులు భావించారు. అభ్యుదయానికి కొన్ని ద్వారాలని తెరవడం విషయంలో అది కొంతవరకు నిజమే. కాని, వచ్చిన ప్రతినిధులమీద ఫలితం ఆధారపడి వుంటుంది. అంటే, ఈ సమావేశంవల్ల ఎటువంటి సత్ఫలితాన్ని ఆశించడానికి వీలు లేదన్నమాట! సంపదతో తులతూగుతున్న దేశాలు ఒక యదార్థాన్ని గ్రహించాయి. ఆర్థిక పరిస్థితినిగాని, రాజకీయ పరిస్థితినిగాని 'సహాయం' చక్కపరచలేదని అవి అర్థం చేసుకున్నాయి.

ఒక దేశాన్ని బాగు చేయడానికి తమ వినాశనాన్ని ఏ దేశమూ కోరుకోదు. అందుకే సంపదగల దేశాలన్నీ జాగ్రత్తపడి—ఆర్థిక, రాజకీయ పరిస్థితుల అభివృద్ధికి వాణిజ్యం ముఖ్యం అని సూచించాయి!

### వాణిజ్య రంగంలో ఇబ్బందులు

డెభ్భయ్యేడు రాజ్యాలు ఒక రంగంగా స్థిరపడినప్పుడు కూడా అంతర్ సమస్యలు ఎన్నో తటస్థపడుతున్నాయి. విదేశ కామన్ మార్కెట్‌వల్ల ప్రయోజనాన్ని ముందుగా గమనించేనా? భారతదేశం అటువంటి అభివృద్ధి కార్యక్రమాన్ని తలపెట్టలేదు? సవుదీఅరేబియాగాని, కువయిత్‌గాని ఇచ్చిపుచ్చుకోవడం దగ్గర భారతదేశంలో వున్న కష్టనిష్ఠురాల్ని గమనించి క్రూడాయిల్ అవసరాన్ని మనదేశం కరెన్సీలో తీర్చకల్గుతుందా?

అమెరికా 'వీటో' సూత్రాలవల్ల నిలద్రొక్కుకోగల్గుతున్నది. ఈ సందర్భంలో లార్డ్ అట్‌లీ చరిత్ర కొంతనిజాన్ని బయట పెడుతుంది:

"వీటో" అనేది నిజమే. అది సెక్యూరిటీ కవున్సిల్‌లో ఏర్పరచుకోవాలి...వీటో అధికారం ప్రత్యేకించి ఉంటుంది. దానిని అత్యవసరపరిస్థితుల్లో మాత్రమే వినియోగించుకోవడం అవసరం.' అని అయన అన్నారు.

ఈ ఇచ్చిపుచ్చుకోవడాల వ్యవహారాన్ని ఈఅంతర్జాతీయ సమావేశం చర్చించి, మేలు చేకూర్చవలసి వుంది.



పశ్చిమ జర్మనీలో తయారుచేసిన ముగ్గురు తొక్కే సైకిల్. దీని ఖరీదు సుమారు రు. 500 లు.

### భాషా వాదంలో శ్రీ నిజలింగప్పగారి ప్రహసనం

ఎలకకు ప్రాణంపోకడ పిల్లికి చెలగాటం అన్నట్టుగా "రోమ్‌నగరం అంటుకుపోతున్నప్పుడు 'నీరో' సంగీతం పాడుతుంది"అనేది ఒక నానుడి. ఇదే విషయం మైసూరు మాజీ ముఖ్యమంత్రులు–కాంగ్రెసు అధ్యక్షులు అయిన శ్రీ ఎస్. నిజలింగప్పగారి విషయంలో రూఢి అవుతుంది. ఆయన ఎర్నాకులంలో మాట్లాడుతూ 'దక్షిణాదివారు హిందీని లింకు భాషగా అంగీకరిస్తారు' అన్నారు అదే సమయంలో మైసూరు రాష్ట్రంలోని ప్రజలు హిందీ వ్యతిరేకోద్యమంలో 'బుల్లెట్ల'ని చవిచూస్తూ మృత్యుమార్గాన్ని తరలి వెళ్తున్నారు! నెహ్రూగారిని అనుసరిద్దామని నిజలింగప్పగారు పండితుని పాఠాలని వల్లెవేస్తున్నారు. నిజలింగప్పగారు కేంద్రంలో పలుకుబడి సంపాదించుకోవడానికి చేసే ఎత్తులలో ఇది సులభగ్రాహ్యమవుతున్నది.

దక్షిణాదివారి మాట అటుంచి, ఉత్తరాదిలోనే హిందీని వ్యతిరేకించే వారున్నారూ అంటే, నిజలింగప్పగారికి కర్ణకఠోరంగా వుండొచ్చుగాని, అది నిజం! సిక్కులు మాతృభూమిని కొంతవరకు ప్రత్యేకించుకొన్నారు. అక్కడ పంజాబీ వ్రాయనూ మాట్లాడనూ చేస్తారుగాని హిందీని గౌరవించరు. హిందీని తుడిచిపెట్టడంలో ముసల్మానులది పైచెయి హిందువులు సంస్కృతంలో ఎలానైతే భగవంతుని ప్రార్థిస్తారో, అలానే ముస్లిములు 'అరబిక్'లో ప్రార్థిస్తారు. ముస్లిములకి, జనసంఘానికి పొత్తు కుదరదు. మీరట్‌లో ఆందోళన ఇందుకు ఒక ఉదాహరణ.

ఇదివరకు చెప్పుకున్నట్లుగా నిజలింగప్ప గారు మరో మవులానాఆజాద్ కావొచ్చు. ప్రజల తరఫున మాట్లాడుతున్నట్లు ఆయన కనిపించవచ్చు. ముస్లిముల ఆదరాభిమానాలకి నోచుకోని మవులానా సాహెబ్ భారతదేశాన్ని విభజించినందుకు పండిట్ నెహ్రూగార్ని ఆడిపోశారు! అదేవిధంగా, నిజలింగప్పగారు దక్షిణాదిపై హిందీని రుద్దలేని హిందీవారిమీద విరుచుకుపడడానికి అవకాశం లేకపోలేదు!

### ఉత్తర దక్షిణ ధృవాల ఏకీకరణ!

భాషావివాదాన్ని ఒక దారికి తీసుకువచ్చేందుకు ఉత్తరదక్షిణ ధృవాల్ని కలిపి సమావేశాన్ని ఏర్పరచాలని ప్రధానమంత్రి శ్రీమతి ఇందిరాగాంధీ కూడా ప్రయత్నిస్తున్నారు. ఈలోపులో హిందీ భాషోన్మత్తమైన రోడ్డురోలరు పరంపరగా నడుస్తూనే వుంటుంది! దానికి ప్రజలు బలవుతూనే వుంటారు!

యు.యన్.సి.టి ఎ డి. సమావేశానికి ముందు ఢిల్లీలోని ముఖ్య భవనాలన్నింటినీ హిందీభాషతో అలంకరించారు విదేశీ ప్రతినిధులందరూ హిందీని నేర్చుకునేవున్నారని ప్రభుత్వం కుశాగ్రబుద్ధికి తట్టివుండొచ్చు. అరబ్బులు కూడా భారతదేశానికి వచ్చేముందు హిందీని 'మాస్టర్' చేసే వుంటారని మనవారి ఉద్దేశంకావొచ్చు! జరిగిందేమిటి? వచ్చిన ప్రతినిధులంతా కాంతివంతమైన అలంకారాలని చూసి తెగమెచ్చుకున్నారు!

కొన్నాళ్ళలో ఆలిండియా రేడియోని వినేవారుండరు ఉత్తరప్రదేశ్, ఢిల్లీ, పంజాబ్ వాసులు రేడియో పాకిస్తాన్‌కి ఎక్కువ ఆకర్షింపబడతారు ఢిల్లీలోని టెలివిజన్ అర్థమయ్యే హిందీలోనే ప్రసారాలు చేస్తున్నది! ఢిల్లీలోని అఖిలభారత విశ్వవిద్యాలయం హిందీని భరించింది. క్రిందటి కాన్వొకేషన్‌లో గ్రాడ్యుయేట్లు గవున్లకి దూరమయ్యారు!

### అంతర్జాతీయ ఖ్యాతికి చిట్కా!

ఇక్కడ రెండు అతి ముఖ్యమైన విషయాలున్నాయి. వీటికి హిందీ భాషోన్మత్తుల సమాధానం లేదు, ఉండదు. వారు అమెరికాకిగాని యునయిటెడ్ కింగ్‌డమ్‌కిగాని చదువుకోసం ఎందుకు వెళ్తున్నట్లు? వారి చేతినున్న వాచీలో అంకెలు ఏ భాషలో వున్నయి? మరి, విదేశీవాచీలని వారుఎందుకు చితక్కొట్టుకోలేకపోతున్నారు?

శ్రీమతి గాంధీ, అంతర్జాతీయ విధానాల మీద ఉపన్యాసాల నివ్వడంలో అఖండ ప్రతిభ కలవారు. ఆమె మాటల్ని ఆమె తన దేశంలో కార్యరూపంలో పెట్టుకుంటే చాలు. హిందీ ప్రాంతంవారయిన రాజకీయ నాయకులు స్వలాభాపేక్ష లేకుండా, నిస్వార్థంతో హిందీని తలదాల్చగలిగేట్టు ఆమె చేయగల్గితే, అంతకన్నా ఏం కావాలి? దేశంలోని ఈ సమస్యని ఆమె నేర్పుగా ఛేదించిననాడు మాటల్ని చేతలలో తప్పక చూపించినవారవుతారు ఆ విధంగా శ్రీమతి గాంధీకి అంతర్జాతీయమైన ఖ్యాతి రాకపోదు!



# గుండెలుతీసిన బంటు



# మెదడుకు మేత

డాక్టర్ మహీధర నళినీమోహన్



# పీపాలోని ద్రవం

■ (క) గుండెలు తీసిన బంటు :

ఇక్కడ చూపిన 3×8 గదులుండే బొమ్మను పెద్దదిగా బల్లమీద గీయండి ఆ గదులలో ఇమిడేపాటంత అట్ట ముక్కలు పదహారు కత్తిరించి, వాటి మీద 1 నుంచి 16 వరకూ అంకెలు వేసి, బొమ్మలో చూపినట్లు అమర్చండి. ఈ ఆటలో అట్టముక్కలు పక్కగదిలో ఉన్న మరో బిళ్ళమీదుగా ఎగిరి, అవతల ఉన్న ఖాళీగదిలో ఆగుతాయి. ఏ బిళ్ళ మీదుగా గంతువేస్తారో, ఆ బిళ్ళను ఆటలోనుంచి తీసెయ్యాలి (పులి జూదంలో పులి మేకలను చంపినట్లు అన్నమాట) ఏటవాలుగా మాత్రం గంతు వెయ్యకూడదు. ప్రతి ఎత్తు ఒకగంతు అయివుండాలి. ప్రతిఎత్తులోనూ ఒక బిళ్ళను తీసివెయ్య వలసిందే. గంతు వెయ్యకుండా పట్టివే పక్క గదిలోకి జరుగకూడదు. ఉదాహరణకి : 1 వ బిళ్ళ 9 వ బిళ్ళమీదుగా దూకి పైనున్న ఖాళీ గదిలో ఆగవచ్చు. ఇప్పుడు 9 వ బిళ్ళను ఆటలోనుంచి తీసివెయ్యాలి దీనినే హ్రస్వంగా (1–9) అని వ్రాయవచ్చు. తరువాతి ఎత్తు (2–10) కావచ్చు. తరువాతది (1–2) కావచ్చు. ఈ విధంగా బల్లమీద ఉన్న 16 బిళ్ళలలోనూ 15 బిళ్ళలను తీసివెయ్యగలగాలి. ఆఖరున మిగిలిపోయిన బిళ్ళ 1 వ ది అయివుండాలి.

ఏదీ ప్రయత్నించండి.

* * *

(చ) పీపాలోని ద్రవం:

ఒక పీపాలో ఏదో ద్రవం ఉంది. అది ఏమిటో మనకి కనిపించడంలేదు. అవసరమూ లేదు. అందులో ఉన్న ద్రవం సరిగ్గా సగం ఉందని ఒకడూ, సగం కన్న కాస్త తక్కువే అని ఒకడూ, సగం కన్న చూపు వాసి ఎక్కువే అని ఒకడూ వాదులాడుకుంటున్నారు. అందులోకి ఏ గజంబద్దనో, మరో కర్రనో ముంచి చూడడం ఒక పద్ధతి ఆ ద్రవాన్ని ఇవతలకు తీసి కొలిచి తెలుసుకోవడం మరోపద్ధతి ఈ రెండు పద్ధతులూ ఉపయోగించకుండా ఆ ముగ్గురిలో ఎవరి మాట సరియైనదో తెలుసుకోవడం ఎల్లాగ? చాలా సులభమైనపద్ధతి ఒకటి ఉంది ఆలోచించండి.

* * *

(ట) బంగారు పలకలు:

సోమనాథ దేవాలయాన్ని గజనీ మహమ్మదు కొల్లగొట్టి విశేషమైన ధనరాసులను తన దేశానికి మోసుకుపోయినసంగతి చరిత్ర పుస్తకాలలో మనమంతా చదువుకున్నాం. ఆ సందర్భంలోనే $12\frac{1}{2}$ అంగుళాల పొడవు, 11 అంగుళాల వెడల్పు, 1 అంగుళం మందం కలిగిన 800 బంగారు పలకలు అతడికి చిక్కాయి. వాటి నన్నింటినీ ఒక పెట్టెలో అమర్చి, ఒంటెలు పూన్చిన బండిలో వేసి తీసుకుపోయాడట. అన్నట్లు ఆ పెట్టె అడుగు భాగం చదరంగా ఉంది. ఈ 800 పలకలనూ—ఇంత పిసరు ఖాళీ మిగలకుండా

(10 వ పేజీ చూడండి)



# బంగారు పలకలు

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| | | | | | | | |
| 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 |
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 |

# భాష - ఘోష


ఇవి చాల పుణ్యం చేసుకున్నాయ్‌రా
వీటికి భాషను గురించిన సమస్య
లేదు ...!!


ఇది తమరిచ్చిన ఇంగ్లీషు పుస్తకం—
ఇదేమో మన ప్రాంతీయ-
భాష లో దాని తర్జుమా !!


ఢిల్లీకో బొంబాయికో పోదామంటే
విన్నారుకాదు - మద్రాసు కాలేజీలో
హిందీ లెక్చరరు
గా చేరారు ??
చూ
ఆంధ్రపత్రిక
24-1-68


ఫ్యాన్సీ స్టోర్
ఊఁ, ఊఁ త్వరగ
మూసెయ్ - స్టూడెంట్లు
వస్తున్నారు
Jayadev


మన "భాషా వ్యతిరేక ఉద్యమం"
జయప్రదంగ కొనసాగటానికి
కాలేజీలూ స్కూళ్లూ మూసేశారు!!
- మనకి బోల్డంత లీజర్


నాకు తెలియని "ఫార్ములా" అంటూ
ఒకటూ లేదు - అన్నీ చదివేశా!!


నీకు "త్రీ లాంగ్వేజ్ ఫార్ములా"
వచ్చా??

ఆ పెట్టెలో సరిగ్గా అమర్చగలిగేరు. ఇంతకీ ఆ పెట్టె కొలతలు మీకు తెలుసా? ఆ పలకలను ఎల్లా పేర్చారో మీరు ఊహించగలరా?

*    *    *

(త) కారుల పందెం:

ఒక గుండ్రటి మైదానం చుట్టూ ఉన్న రోడ్డుమీద మోటారుకారుల పందెం




జరుగుతోంది. ఆ పోటీలో రకరకాల కారులు పాల్గొన్నాయి. వాటిలో తెల్లటిది ఒకటి ఉంది. ఆ తెల్లని కారుకి ఎదర ఉన్న కార్లలో మూడోవంతుని వెనుక ఉన్న కార్లలో ముప్పాతికవ వంతు కలిపితే ఆ పందెంలో పాల్గొన్న మొత్తం కార్లు ఎన్నో తెలుస్తాయి. ఏదీ, మీకు తెలిసిందా?

## జ వా బు లు

(క) 3–11 ; 9–10 ; 1–2, 7–15 ; 8–16; 9–7; 5–13; 1–4 ; 8–5 ; 6–14 ; 3–8 ; 6–3 ; 6–12 ; 1–6 ; 1–9.

ఈ విధంగా ఎత్తులు వేస్తే చిట్ట చివర 1 అంకె ఉన్న బిళ్ల మిగిలిపోతుంది.

*    *    *

(చ) పీపాను జాగ్రత్తగా పక్కకు ఒరిగించాలి. ఇంకొంచెం వంచుతే ఒలికిపోతుందా అన్నట్లు ద్రవపు మట్టం మూతి అంచుకి తగిలేలా ఉంచు.

అప్పుడు ద్రవపు మట్టం పీపాయొక్క అడుగుభాగానికి 1 వ బొమ్మలో చూపినట్లు తగులుతూఉంటే ద్రవం సరిగ్గా సగం ఉన్నట్లు; 2 వ బొమ్మలో చూపి

# మెదడుకి మేత

(8 వ పేజీ తరువాయి)




నట్లు ఉంటే సగంకన్న ఎక్కువగా ఉన్నట్లు. 3 వ బొమ్మలో చూపినట్లయితే సగంకన్న తక్కువగా ఉన్నట్లుగా గ్రహించాలి.

*    *    *

(ట) 100 అంగుళాల పొడవు, 100 అ॥ వెడల్పు, 11 అం॥ లోతు కలిగి ఉండి ఉండాలి ఆ పెట్టె. 8 పలకలను ఒకదానితరువాత ఒకటి (నిలువుగా) అమరుస్తే $8 \times 12\frac{1}{2} = 100$ అంగుళాలు అవుతుంది. ఇటువంటి వరుసలు తొమ్మిది ఒకదానిపక్కన ఒకటి ఉంచితే $9 \times 11 = 99$ అంగుళాలు ఆక్రమిస్తాయి. వాటి సంఖ్య $9 \times 8 = 72$ పలకలు. ఇవి అన్నీ పెట్టెఅడుగున ఒక దొంతరలా ఏర్పడుతాయి పెట్టెలో ఒక చివర ఒక అంగుళం వెడల్పు, 100 అం॥ పొడవు ఉన్నజాగా మిగిలిపోతుంది. ఈ పలకలమీద ఇదేవిధంగా మొత్తం 11 దొంతరలు పేర్చుతే 792 పలకలు అవుతాయి పెట్టెలో ఇంక మిగిలిపోయిన చోటు $1 \times 11 \times 100$ ఘనపు అంగుళాలు. ఈ స్థలంలో 8 పలకలు (అంచు మీద నిలువ పెడితే) పడతాయి. మొత్తం 800 పలకలూ కాళీ మిగలకుండా పడతాయి.

*    *    *

(త) దారి గుండ్రంగా ఉంది కనుక తెల్ల కారుకి ముందర యెన్ని కార్లు ఉన్నాయో సరిగ్గా అన్నే వెనుక కూడా ఉంటాయి. మొత్తం కార్లు X అనుకుంటే తెల్లకారుకి ఎదర ఉన్నవీ, వెనుక ఉన్నవీ కూడా (X–1)

$$\frac{(X-1)}{3} + \frac{3}{4}(X-1) = X$$

సమీకరణాన్ని సాధిస్తే మొత్తం పోటీలో పాల్గొన్నకారులు 13 అని తెలుస్తుంది. ●



# అపర పరశురాముడా? అసురుడా?

బొగోటా (కొలంబియా రిపబ్లిక్) అనేచోట వెనిజులన్ అనే అతను మరొక నిషాదుడితో యాభై మంది ఇండియన్స్‌ని చంపేశాడట. అన్నార్తులకైన వారికి భోజనం పెడతాము రండి అని పిలిచి, అందర్నీ చంపేసి, వారిమీద గాసోలిన్ పోసి నిప్పెట్టేశాడట. ఆ ప్రాంతాల్లో వున్న ఇండియన్స్‌ని చంపమని తనకు కొంతమంది ధనం యిచ్చారని చెప్పాడట అతను. ఈ వెనిజులన్ అనే అతనికి "గొడ్డలి పూనిన రాజు" అని అక్కడివారు పేరెట్టారట. రాజా! రాక్షసుడా!! (ఇండియన్స్ అన్న పదానికి హిందువులని అర్థం చెప్పుకోవాలా - రెడ్ఇండియన్స్ అని అర్థం చెప్పుకోవాలా!)

* * *

గన్నేరు పప్పులను బాదం పప్పులనుకొని భ్రమపడి, అవి తిన్న ఫలితంగా బప్పి అనే 25 ఏళ్ల వ్యక్తి కోయంబత్తూరు ఆసుపత్రిలో యిరవైనాలుగో తేదీన చనిపోయాడట!—పాపం!!

## అవివాహితులకు కుటుంబ నియంత్రణా!

కుటుంబనియంత్రణకు సంబంధించిన మాత్రలు మాకు కావాలంటే మాకు కావాలి అని ఎడింబరో యూనివర్సిటీ విద్యార్థులు పట్టు పట్టినందుకు ఆ యూనివర్సిటీ రెక్టార్ 'మాల్కామ్ మాగరిడ్జ్' అనే ఆయన తన పదవికి రాజీనామా యిచ్చారట. వివాహం కానివారికి యీ మాత్రల జోలి యెందుకో తనకర్థం కావటం లేదన్నారాయన— ఎందుకో..

## మిలటరీ ట్రక్‌తో ఢీ

ఢిల్లీ ఆల్ఇండియా రేడియో వారి వేన్ ఒక ఆర్మీ ట్రక్‌తో ఢీ కొని పప్పు పప్పయి పోయిందట. అందులో ప్రయాణం చేస్తున్న లక్ష్మణ్ జోషి అనే కన్నడవార్తలు చదివే ఆయన అక్కడికక్కడే మరణించాడనీ, మరో అయిదుగురు తీవ్రంగా గాయపడ్డారనీ తెలిసింది— ఇది ఫిబ్రవరి 1వ తేదీన తెల్లవారు ఝామున 5.30కి జరిగిందట.




"ఉద్యోగాలు కావాలి గాని, ఈ డిగ్రీలు ఎందుకు?" అంటూ ఢిల్లీ యూనివర్సిటీ స్నాతకోత్సవం (కాన్వొకేషను)లో భాటియా అనే యమ్మెస్సీ విద్యార్థి చివాలున లేచి ఓ గవుకేక వేశాడట. అతన్ని వెంటనే ఓ నలుగురు బైటకు లాక్కుపోయి నాలుగు తన్నారట. తను చెడుభావంతో అనలేదని, ముందు పథకం వేసుకోలేదని, ఉద్రేకంతో వచ్చిన వూపుతో అన్నానని అతను చెపుతూ "అలా అన్నందుకు నాకెంతో ఆనందంగా వుంది." అన్నాడట.

## వింత కాన్పులు

సిడ్నీ ఆసుపత్రిలో 90 నిమిషాల్లో వచ్చిన కానుపు కేసుల్లో రెండు కానుపులకు ముగ్గురేసి మగపిల్లలు పుట్టారట. ఈ ఆరుగురు శిశువులూ క్షేమంగా వున్నారట. ఇద్దరు తల్లులు కూడా ఖులాసానే. ఈరకం కేసు ఇదే ప్రపంచంలో మొదటిదేమో అని ఆ ఆసుపత్రి వారభిప్రాయ పడుతున్నారు.

## టిక్కెట్ లేకుండా ప్రయాణాలు

దానేపూర్ డివిజన్‌లో ఈస్టరన్ రైల్వేలో టిక్కెట్టు లేకుండా ప్రయాణం చేస్తున్న వారిలో 25,377 మంది పట్టుబడ్డారట. 81,560 రూపాయలు వసూలు చేశారట. ఈసంఖ్య కేవలం 13 వారాలలో సేకరించినదట. (13 వారాలకే) ఇంతకే అంటైతే,,,అంతకెంత??

* * *

## మహీధరోక్తులు

మహీధర నళినీమోహనరావు



ఆడుదానిగన్న పది
యెట్టిదైయున్న
వలపు దేవుడైన నిలుపలేడు
బీబి మీద మోజు
వెంకన్న చూపడా?
హృదయ వర్తి యీ మహీధరోక్తి

# బోటు షికారుకి వెళ్తే ప్రమాదం

రాయపురం (మద్రాసు) ప్రాంతంలో బోటు షికారుకు వెళ్లిన 20మంది ఆ బోటు తిరగబడటం వల్ల సముద్రంలో పడిపోయారట! (3వ తేదీ) 14మంది ఎలాగో ఒడ్డు చేరారనీ, భక్తవత్సలన్ యాదు అనే అతని శవం కొట్టుకువచ్చిందనీ, మిగతా ఐదుగురి పత్తా తెలీలేదని వార్త వచ్చింది.

# క్రికెట్ ఫాన్

బొంబాయి సమీపంలో ఒకరైలులో ప్రయాణం చేస్తున్న క్రికెట్ ప్రియుడు ఆస్ట్రేలియాతో ఇండియా సరిగా ఆడనందువల్ల విసుగు చెంది




"ఛీ—...మరీ అన్యాయం" అని విసుక్కుంటూ చేతిలోని ట్రాన్సిస్టర్‌ని కోపంతో విసిరి రైల్లోంచి బయట పారేశాడట. అతనెంత (క్రికెట్) ఫాన్! 

# టాక్సీ డ్రైవర్ మీద బాంబు

కలకత్తాలో నడిరోడ్డుమీద టాక్సీనడుపుతున్న డ్రయివరు ఒకతనిమీద ఒక బాంబుపడి, పేలిందట. అతను అక్కడే మరణించాడట (2వతేదీన) అయితే ఆ బాంబు ఎక్కడనుంచి ఎగిరొచ్చి అతనిమీద పడిందిలన్న విషయం ఆచూకీ తేల్లేదు. విశ్వయుంగా ఇంద్రుడో, చంద్రుడో వేసివుండడు కదా—అయితే ఎవరు, ఎందుకు వేశారు?— ఇంకా తేలలేదు.....

*          *          *

నాలుగు సంవత్సరాలునా తనని వదలని అతి మూత్ర వ్యాధిని తనే వదిలి పెట్టడానికి తీవ్ర నిశ్చయం చేసుకున్న ఒకాయన ఆసుపత్రిన లుగింతమ్మల భవనం—మీద నుంచి దూకి, ఆత్మహత్య చేసుకున్నరట. ఆయన యూనియన్ విద్యాశాఖలో అండర్ సెక్రటరీగా వున్నారట. ఇది 5వ తేదీన ఢిల్లీలోనే జరిగింది.

# కత్తిపోటు - కల్తీసారా - మరణాలు

కలకత్తాలో జనవరి 28 నాటికి ఆల్కహాలు త్రాగి చనిపోయిన వారిసంఖ్య 96 అని తేలింది. కత్తిపోటు వల్ల చనిపోయినవారి సంఖ్య (మీరటలో) 13 అనీ, అల్లరుల సందర్భంలో అరెస్టయిన వారి సంఖ్య 365 అనీ మీరట్ లెక్క తేల్చింది.

# ఎరువు గుండెతో ఖులాసా

ఎరువు గుండె బెయిల్‌బర్గ్ తన 25 రోజుల క్రొత్త గుండెతో ఖులాసా గానే వున్నాడు. జనవరి 28న లేచి తిరగడమే గాక, తన గడ్డం తనే గీసుకోవడం, బూటు తొడుక్కోడం వరండలో పచార్లు చెయ్యడం వంటివి చేస్తున్నాడని డాక్టర్లు చాలా ఆనందిస్తున్నారు.

గుండెలో ఒక కవాటం చెడిపోతే పంది గుండెలో అదే కవాటాన్ని తీసి 'హెరీహోల్ట్స్' అనే అతనికి ఒకనెల క్రితం అతికారట లీడ్స్ (లండన్)లో ఒక ఆసుపత్రిలో. ఆయన మొన్న ఆసుపత్రినుంచి సుఖంగ




విడుదల పొందాడు. ఈ గుండె మార్పిడి పోయి పోయి ఎక్కడాగుతుందో!

—ఫాలాక్షుడు ●

# రచయితలకు మనవి

## కథలు, వ్యాసాలు

ప్రచురణకి స్వీకరింపబడని తమ వ్రాతప్రతులని తిప్పిపంపగోరే రచయితలు వ్రాతప్రతులతోబాటే తగుమాత్రం తపాలాబిళ్లలు అతికించిన, స్వంత చిరునామాకల కవరు కూడా పంపాలి. స్టాంపులు మాత్రం పంపరాదు. స్టాంపులు మాత్రం పంపించినట్లయితే వ్రాతప్రతులు తిప్పిపంపబడవు. వ్రాతప్రతులతో గాక విడిగా స్వంత చిరునామా, తగుమాత్రం పోస్టేజికల కవర్లు పంపినా వ్రాతప్రతులు త్రిప్పిపంపబడవు.

ప్రచురణకి స్వీకరింపబడని వ్రాతప్రతుల విషయంలో ఎటువంటి ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపబడవు.

## నవలలు

ప్రచురణకి స్వీకరింపబడని నవలల వ్రాతప్రతులు మేమే తిప్పి పంపిస్తాము. వ్రాతప్రతులతో స్వంత చిరునామాకల, తగుమాత్రం పోస్టేజి అతికించిన కవర్లు పంపనవసరం లేదు. 100 ఆరఠావు పేజీల పయిన ఉన్న వ్రాతప్రతులే నవలలకింద పరిగణింప బడుతాయి.

## కార్టూన్‌లు

ప్రచురణకి స్వీకరింపబడని కార్టూన్‌లు తిప్పి పంపగోరేవారు కార్టూన్లతో స్వంత చిరునామాకల, తగుమాత్రం పోస్టేజి అతికించిన కవర్లు జతపరచి పంపాలి. స్టాంపులు మాత్రం పంపరాదు.

**షరా:** వ్రాతప్రతులనీ, కార్టూన్లనీ వీలయినంత భద్రంగా తిప్పిపంపే ప్రయత్నాలు చేస్తాము కాని, వాటి విషయమయి ఎటువంటి బాధ్యతనీ స్వీకరించలేము. ఈ షరతుని గమనించి రచయితలు తమ రచనలు, కార్టూన్‌లు పంపగలరు.

*సంపాదకుడు*
*ఆంధ్ర సచిత్ర వారపత్రిక*

# భారతీయ అంతర్జాతీయ వాణిజ్య పరిశ్రమల ప్రదర్శన

మద్రాసులో భారతీయ అంతర్జాతీయ వాణిజ్య పరిశ్రమల ప్రదర్శనకు జనవరి 21న భారత ఉపరాష్ట్రపతి ప్రారంభోత్సవం చేశారు. ఇది వివిధ ప్రాంతాలవారినీ విదేశీయులని కూడా ఆకర్షిస్తున్నది. 200 ఎకరాల విస్తీర్ణంగల ప్రదేశంలో ఏర్పాటయిన ఈ ప్రదర్శనలో 156 మంది ప్రదర్శకులు పాల్గొన్నారు. అందులో 1/7 వ వంతు విదేశీయులు. మొత్తం 22 దేశాలు ప్రదర్శనలో ప్రాతినిధ్యం వహించాయి. రష్యా, పశ్చిమజర్మనీ విదేశ ప్రదర్శనశాలలు అన్నిటిలోనూ పెద్దవి. హంగేరీ, బల్గేరియా, సంయుక్త అరబ్ రిపబ్లిక్, పోలాండ్, రుమేనియా ప్రదర్శనశాలలు మిగతావి. విదేశ ప్రదర్శనశాలలు ఆక్రమించిన స్థలానికి 5 రెట్లు భారతీయ ప్రదర్శనశాలలు చోటు చేసుకున్నాయి. రాష్ట్రప్రభుత్వాలు, కేంద్ర మంత్రివర్గాలు, ప్రభుత్వరంగం, వాణిజ్య, వాణిజ్యేతర, భారీ, మధ్యతరహా, చిన్నకారు పరిశ్రమలకి చెందిన ప్రదర్శనశాలలు అందులో ఉన్నాయి.

ధ్వజాకారపు కప్పు కలిగిఉన్న మహారాష్ట్ర ప్రదర్శనశాల ఆ రాష్ట్రంలోని పారిశ్రామిక, సాంస్కృతిక ప్రాభవాన్ని ప్రతిబింబింపజేస్తున్నది.

మీటనొక్కితే కోరినట్లు చిల్లరయిచ్చే 'ఆటో కాషియర్' ప్రేక్షకుల్ని బాగా ఆకర్షిస్తుంది.

దాదాపు 1,50,000 చదరపు అడుగుల ప్రదేశంలో ఆకర్షణీయంగా రూపొందించిన భారత రైల్వేల ప్రదర్శనశాల చూపరుల్ని ఆకట్టుకుంటుంది. వివిధ రైలుమార్గాల నమూనాలను కూడా యిందులో ప్రదర్శిస్తున్నారు. ఒక అడుగు వెడల్పుకల పట్టాలపై పెట్రోలు యింజనుతో ప్రదర్శనశాలచుట్టూ తిరిగే రైలుబండి పిల్లలకి ఆనందాన్నిస్తుంది.

ఇండియన్ ఎయిర్ లయిన్స్ కార్పొరేషన్ వారి ప్రదర్శనశాల ఆధునిక జట్‌యుగాన్ని ప్రతిబింబింపజేస్తున్నది.

కెనరాబాంక్ ప్రదర్శనశాలలో 50 దేశాల కరెన్సీనోట్లు, చెక్కులపై అంకెల మార్పుని కనిపెట్టే యంత్రం చూపరుల్ని ఆకర్షిస్తాయి.



పంచశీల గోపురం.

1961లో అవతరించిన గుజరాత్ రాష్ట్రం ప్రదర్శనశాలలో ఆ రాష్ట్రంలోని పారిశ్రామిక, తదితరమైన ప్రగతి ప్రతిబింబితమవుతున్నది.

ప్రదర్శనకి మధ్య 154 అడుగుల ఎత్తున నిర్మింపబడిన 'పంచశీల గోపురం' పైకి 100 అడుగుల ఎత్తువరకూ చూపరులు వెళ్ళి ఆ ఎత్తునుంచి ప్రదర్శనని, మద్రాసు నగరాన్ని చూడ వీలవుతుంది.

పశ్చిమ బెంగాల్, ఒరిస్సా, ఆంధ్రప్రదేశ్, మద్రాసు, కేరళ, ఢిల్లీ రాష్ట్రాల ప్రదర్శనశాలలు ఆయా రాష్ట్రాలలోని పారిశ్రామిక, వ్యావసాయిక, తదితరరంగాలలోని పురోభివృద్ధికి ప్రతిబింబాలుగా ఉన్నాయి.

'ఇండియా బజార్' చూపరులతో కళకళలాడుతుంటుంది.

ఈ ప్రదర్శనని పూర్తిగా చూడడానికి కనీసం మూడురోజులు పడుతుంది. నడవలేనివారికీ, పైపైన చూసిపోదామనుకునే వారికీ ప్రదర్శన అంతా చుట్టివచ్చే బస్సులను ప్రత్యేకంగా ఏర్పాటు చేశారు.

వ్యాసం ఫొటోలు:

సి. డి. కె. మూర్తి.



ఎత్తునించి చూస్తే కనిపించే ప్రదర్శన దృశ్యం.




**బి. ఎస్. ఎన్, విశాఖపట్నం**

నాకు ప్రశాంతంగా ఉండే చోటికి పారిపోవాలని ఉంది.

మీలాంట వాడే తన నీడకు సిరకుండా తానే పరుగెత్తాట్ట!

**సిహెచ్. డి, సామర్లకోట**

గత రెండు సంవత్సరాల నుండి అన్నీ ఇబ్బందులే. ప్రాణం విసిగి పోతూంది.

ఆపదలు త్వరితంగా వస్తాయిగని వేగంగా వెళ్లవు సోదరీ, ఓపికే మందు.

**డి. కె. కె, విశాఖపట్నం**

నాకు ఎక్కువగా మాట్లాడ్డం అల వాటు. నే చెప్పే మాటలు ఒక్కొక్క ప్పుడు నా స్నేహితులు నమ్మరు.

అధిక ప్రసంగం అబద్ధాలకు పుట్టిల్లు అని తెలిసిన వారై ఉంటారా స్నేహితులు! అవునా?

**పి. పి. డి, చిత్తూరు**

అక్కా, వంచిన నడుం ఎత్తకుండా పని చేసినా, ఏవో లోపాలు ఎంచి సాధి స్తారు. నాకు చాలా బాధగా ఉంటుంది.

చూసే వాకేం శ్రమ, చేసేవారికిగాని చెల్లీ!

**ఎన్. ఎల్. కె, తుని**

మా ఆవిడకి అసలు నోరు మంచిలేదు. చుట్టుపక్కల అందరితోనూ జట్టీలే. నాకు తలెత్తుకోలేని స్థితి ఏర్పడేలా వుంది.

దీన్నే నోరు మంచిదైతే ఊరు మంచిదవుతుంది అంటారు. మీరే చెప్పాలి సోదరా, ఓర్పు!

**ఎస్. ఎస్. జి, నిజామాబాద్**

కొందరు వ్యక్తులు తీయని మాటలు చెప్పి మోసపుచ్చుతారు. అలాంటి వారిని ఏమనాలి?

వాళ్లనెందుకు అనడం? తీయని మాటలు విని మోసపోయే వారి ననాలిగాని!

**కె. ఎస్, పాకాల**

బాధకు శాశ్వతమైన రూపం ఏది?

తృప్తిలేని మానవజన్మ!

**జె. పి, హైదరాబాదు**

అక్కయ్యా మానవులు సాధింపలేనిదేది?

సాధించలేక పోయిందే చెల్లాయీ.

**కె. ఎల్. జి, రాజమండ్రి**

ఓ మంచి కలం పేరు, ఎవ్వరూ ఇంతవరకూ పెట్టుకోనిది, చెప్పి పుణ్యం కట్టుకుంటారా?

"ఇంటిపేరు" అనే పెట్టుకో తమ్ముడు కొత్తగా ఉంటుంది.

**వి. ఆర్. ఆర్, సికిందరాబాదు**

ప్రేమించి పెళ్లిచేసుకొన్న వారికి విడాకులు తప్పవంటారు. మీ అభిప్రాయం?

విడాకులు తప్పక పోవడానికి ప్రేమించి పెళ్లి చేసుకోడమే కారణం కానక్కరలేదు.

**సి. ఎస్. ఆర్. టి, కడప**

మా శ్రీమతిది స్పోర్టివ్ నేచరు కాదు సరదాగా ఏదైనా మాటంటే దాన్నే పట్టు కొని రెండురోజులు సరిగా మాట్లాడదు. నాకు కష్టమనిపిస్తుంది.

వేళాకోళం కూడా మితిమీరకూడదు. "తమల పాకుతో నేనిట్టంటే— తలుపు చెక్కతో నేనిట్టంటి" అన్న పాత పాటలాగా ప్రవర్తిస్తారు కొందరు. సున్నితమైన హాస్యం ఆహ్లాదాన్ని, మోటుది జుగుప్సని కల్గిస్తుంది. ఏం చేస్తాం?

**డి. ఆర్. డి, రాజమండ్రి**

మెంథాల్ అంటే ఏమిటండీ?

పిప్పరమెంట్ నూనెలోంచి తీసేది మెంథాల్. మింట్ అని కూడ అంటారు. ఇది మన పుదీనాలో ఎక్కువ ఉంటుంది. నరాలకు సంబంధించిన బల హీనతలవల్ల వచ్చే తలనొప్పులకి యీ మెంథాలే వాడుతూ ఉంటారు.

**ఎమ్. ఎమ్. ఎల్, ఆదిలాబాదు**

కథలలో స్త్రీ పాత్రలకు అధిక ప్రాముఖ్యం యివ్వడంలో మీరు పక్షపాతం చూపిస్తున్నారేమో

సంసార నాటక సూత్రధారి స్త్రీయే కదా. ఇన్నేళ్లు పురుషుడే పక్షపాతం చూపించినప్పుడు స్త్రీలు చూపించడంలో విపరీతం ఏముంది సోదరీ?

**పి. వై. నాయుడు, లక్ష్మీపురం**

మీ పెద్దమ్మాయి ఏం చదువుతోంది? మంచి ముహూర్తం చూసి రావచ్చా అక్కయ్యా?

లాభంలేదు తమ్ముడూ, ఇంకా ఒకటిన్నర దశాబ్దం ఆగు— ఆ మంచిరోజుకోసం!

**ఎస్. ఆర్. ఆర్, బర్గాన్**

వ్యక్తిత్వము గల మానవుడు కాపాడు కొనవలసినది ఆత్మగౌరవమా? సంఘ గౌరవమా?

ఆత్మగౌరవమే. అదే కాపాడుకోలేనివాడు సంఘ గౌరవం ఎలా కాపాడుతాడు?

**యస్. ఏ. డి, హైదరాబాదు**

పెండ్లి అయిన తరువాత చదువు మానివేయాలని అబ్బాయి అభ్యంతర పెడుతున్నాడు. చదువు సాగించాలా లేక స్వస్తి చెప్పి పెండ్లి చేసుకోవాలా?

పెళ్లి చేసుకోదలిస్తే ఎంతో చదువుకు స్వస్తి చెప్పించాలని అనుకోకండి. అయినా కొత్త సంసారం ప్రతిభ కాలేజీ లాంటిది. దాంట్లో సర్దుకు రావడమే పెద్ద పరీక్ష. పైగా కాలేజీలో చదువు కూడా ఎందుకు?

**కె. ఎల్. పి, వారణాశి**

ప్రశ్నావళి పూర్తి అడ్రసు చెప్తారా?

పత్రిక అడ్రసే!

**జి. జి విజయనగరం**

పెళ్లి చేసుకోకపోతే వచ్చిన నష్ట మేమిటండీ?

ఏమీలేదు.

**వి. వి. బి. ఆర్, కురదారెడ్డు**

మనిషి ఎప్పుడు ఆనందంగా ఉంటాడు?

ఎప్పుడూ ఉండడు. ఒకవేళవున్నా అది క్షణ కాలం మాత్రమే.

**ఇ. టి. ఆర్, కావలి**

షేక్స్పియరు సాహిత్యం గొప్పదా? బెర్నాడ్‌షా సాహిత్యం గొప్పదా?

సాహిత్య రోగికి రెండూ గొప్పవే. పాత పూర గాయి పత్యానికి తింటాడు. కొత్త పూరగాయ రుచికి తింటాడు— అలాగే షేక్స్పియరూ, షానూ.

**ఎస్. ఎస్, ఖర్గపూరు**

కలలు నిజమైతే...

ఏముంది కోరికలు గుర్రాలవుతాయి!






'పెద్దబాబుగారు మీరు ఒక్కసారి యిల్లా రావాలి' అని ఆ కుర్రవాడు రామచంద్రయ్యగారితో అన్నాడు,

ఆయన కూర్చున్న చోటునుంచి కదలకుండానే 'దేనికి?' అని అడిగాడు. చెప్పడానికి కుర్రవాడు క్షణకాలం సందేహించాడు.

'ఏం జరిగింది?' అని ఆయన కళ్లతోనే ప్రశ్నించాడు. ఆ ప్రశ్నకు సమాధానంగా ఆ కుర్రవాడు 'కాకులు' అని అన్నాడు.

'ఏమిటి?'

కాకులు...

'నాకు తెలుసు నాయనా! నాకు తెలుసు.'

కుర్రవాడు ఏం మాట్లాడలేదు

రవ్వంత దూరంలో తెరలుకట్టిన బండి వెళ్లిపోతోంది.

ఎటు చూశినా నిశ్శబ్దం! నిశ్శబ్దం!

ఒక ముసలివాడు రామచంద్రయ్యగారి దగ్గరకు వచ్చి, నిలబడ్డాడు.

'బండి ఇంటికి వెళ్లిపోతోంది' అని అన్నాడు.

'గది గుమ్మంలో దీపం వుంచమను.'

'పెద్దబాబుగారు!' అని ఆ కుర్రవాడు మళ్లీ అన్నాడు. రామచంద్రయ్యగారు ఉలిక్కి పడ్డారు. కుర్రవాడి వెంట నడిచి వెళ్లారు. అక్కడ అంతా యీయనకోసం కనిపెట్టుకుని వున్నారు. తూర్పుదిక్కున వేపచెట్టుమీద, కాలువ ఒడ్డున మర్రిచెట్టుమీద కాకులు దండిగా కూర్చున్నాయి.

రామచంద్రయ్యగారు వెనక్కి తిరిగి చూశారు. గుడ్డలుకట్టిన బండి రోడ్డు మలుపు తిరిగి కనుచాటయింది.

కాకి కావు! కావు! మని అరిచింది.

'నాయనా శంకరం నువ్వు ఏ దిగులు పెట్టుకోకు నాయనా. అన్నీ నీ యిష్ట ప్రకారమే జరుగుతాయి. రా నాయనా భోజనం చెయ్యి.'

శంకరంలో ఏం చలనం లేదు.

మాకు ఎవ్వరికీ నీమీద కోపంలేదు నాయనా! నువ్వు నన్ను అన్యాయం చేశావని నేను అనుకోవడంలేదు.'

శంకరం ముందుకు సాగలేదు.

మనస్సులో ఏదో ఆలోచన మసలింది. కంటనీరు తిరిగింది.

'నీ మనస్సు నాకు తెలుసు శంకరం. శ్యామలకు ఏ లోటూ రానివ్వను, శ్యామలను వివాహం చేసుకోమని నేను స్వయంగా ప్రార్థిస్తాను. వాళ్లకు కలిగిన బిడ్డను నేను పెంచుకుని నా ఆస్తి అంతా యిస్తాను. శ్యామలను ఒప్పిస్తాను నాయనా.

నామాట వినవూ! చాలా దూరం ప్రయాణం చెయ్యాలి. మారాం చెయ్యకుండా భోజనం చెయ్యి నాయనా!'

శంకరం తండ్రిమాట కాదనలేకపోయాడు.

గోలగా చెట్టుమీద కాకులు ఒక్కసారి లేచాయి. ఎగిరివచ్చి నేలమీద వాలాయి. విస్తరిలో మెతుకు మిగల్చకుండా తిని వెళ్లిపోయాయి, ఎల్లా వచ్చిందో ఎప్పుడు వచ్చిందో, ఒక ఆవు వచ్చి విస్తరి నమిలి తినివేశింది.

'ఇంత ఆకలిగా వుంటె తిననన్ని మారాంచేస్తే ఎల్లా నా తండ్రీ! చూడు ఎల్లా వుండే వాడివి ఎల్లా అయి

పోయానో...'

ఇంటిదగ్గర వందలాదిగా వచ్చిన బ్రాహ్మణ సమూహంలోంచి ఒక వృద్ధ బ్రాహ్మణుడు రామచంద్రయ్యగారిని చూడగానే నమస్కారం చేసి

'బాబు వేదం యెనభై నాలుగు పన్నలు క్షుణ్ణంగా చదివినవాడిని...' అంటూ ఏద్దో చెప్పబోయాడు.

ప్రక్కనున్నవాళ్ళు 'ఊరుకోవయ్యా సబబు సందర్భం తెలియాలి...' అని మందలించారు.

రామచంద్రయ్యగారు అతనివంక ఒక క్షణం మౌనంగా చూశారు. పెదవిమీద చిరునవ్వు కనిపించింది.

'దక్షిణ ఎక్కువ కావాలి అంతేనా?' అని అన్నారు

ముసలి బ్రాహ్మణుడు ఏం మాట్లాడ లేదు.

ఆ పేటలోని ఆడా మొగా అంతా గుంపులు గుంపులుగా వచ్చి వెడుతున్నారు.

అందరిలోకి పెద్దావిడ వెడుతూ ఇంకొక చిన్నావిడతో

'ఆ దీపంలో రవ్వంత నూనె పోయవే. వచ్చేవాళ్ళు ఇంకా చాలామంది వున్నారు' అని అంది.

'నాకు భయంగా వుంది అత్తయ్యా' అని ఆ మనిషి సమాధానం చెప్పింది.

'అన్ని పనులకి నేనే చావాలి!' అని అంటూ విసుక్కుంటూ ముసలావిడ లోపలికి వెళ్ళింది.

ముసలాయన పందిట్లోకి రాగానే పంక్తులు తీర్చి కూర్చున్న జనం ఒక్క క్షణం మూగబోయారు.

ప్రక్కనున్న మనిషివంక చూశి ఆయన తల వూచాడు. వడ్డన ప్రారంభమైంది. ఆ పదార్థాలకి ఆ ఆధరువులకి అంతం లేదు. ఆ రుచికి లోటు లేదు.

అప్పుడే క్రొత్తగా వైదికంలో ప్రవేశించిన బాల బ్రహ్మచారి ప్రక్కనున్న నడికారు మనిషితో—

'పెళ్ళి భోజనంకన్నా బాగుంది మామా!' అని అన్నాడు.

'నోరు మూసుకోరా శుంఠా!' అని మామ మందలించాడు.

భోజనం చేస్తున్న పంక్తుల మధ్య నుంచి రామచంద్రయ్యగారు మెల్లిగా నడుస్తున్నారు.

'అయ్యా, కాలాతీతం కాలేదు. నింపాదిగా భోజనం చెయ్యండి. సంతృప్తిగా భోజనం చెయ్యండి' అని అన్నారు.

ఎవరికి వారే మనస్సులో చిత్తం! చిత్తం! అని అన్నారు.

పందిరి చివర ఒక చిన్న అమ్మాయి పువ్వుల పువ్వులుగౌను వేసుకుని వుంది. ఈయన్ని చూడగానే ఎత్తుకోమని చేతులు జాచింది. రామచంద్రయ్యగారు లాలనగా ఆ పిల్లని ఎత్తుకున్నారు.

'తాతయ్యా! నాకు లడ్డూ కావాలి' అని అంది.

మరుక్షణం, పాప చేతిలోకి, లడ్డూ వచ్చింది.

'మనింటో పెళ్ళా, తాతయ్యా?'

'అవునమ్మా!'

'ఐతే మరి అమ్మ నాకు క్రొత్త బట్టలు కుట్టించలేదేం?'

'కుట్టిస్తుందిలే తల్లి.'

'అత్తయ్య నాతో మాట్లాడటం లేదు తాతయ్యా!'

'మాట్లాడుతుందిలే అమ్మా.'

'రెండో వరుసలోకి అన్నం రావాలి' అని ఎవరిదో గొంతుక వినిపించింది.

'పెళ్ళికొడుకు ఏడి తాతయ్యా!'

తాతయ్య ఏం మాట్లాడలేదు.

'మాట్లాడవేం తాతయ్యా!'

తాతయ్య ఉలిక్కి పడ్డాడు.

'ఏమిటమ్మా'

'పెళ్ళికొడుకు ఏడి తాతయ్యా!'

'వూరు వెళ్ళాడమ్మా'

'భలేవాడే పెళ్ళి అవుతూవుంటే వూరికి వెళ్ళాడా?'

'సరోజా!!' అంటూ ఒక ప్రౌఢ కంఠం వినిపించింది.

సరోజ వాళ్ళ అమ్మ దగ్గరకు పరుగెత్తుకుని వెళ్ళింది.

'చిన్నదాని మాటలు పట్టించుకోకండి బాబు' అని ఎవరో అన్నారు.

'దైవం మనతో మాట్లాడేది వాళ్ళ ద్వారానే' అని రామచంద్రయ్యగారు మనస్సులో అనుకున్నారు.

'భోజన కాలే భగవన్నామస్మరణ గోవిందా! గోవిందా!' అని భక్తుడొక్కడు కేక పెట్టాడు.

బ్రాహ్మణుల భోజనాలు అయ్యాయి. తాంబూలాలు దక్షిణలు యథావిధిగా ముట్టాయి.

అరగంట గడవకుండానే భోజనాల సావిడి కడగటం, గుడ్డలు పెట్టి తుడవటం, చూస్తూ వుండగానే, నీటి చుక్క మిగలకుండా ఆరిపోవడం అంతా జరిగిపోయింది.

ముత్తైదువులు వచ్చి ముగ్గులు వేశారు. బ్రాహ్మణులు సభగా కూర్చున్నారు. రామచంద్రయ్యగారు తనకు వీటితో ఏం సంబంధం లేనట్టుగా చూస్తూ వూరుకున్నారు.

'తమరు ఒక్కసారి యిలా దయ చేయాలి' అని ఆయన్ను ప్రార్థించారు.

'దేనికి?'

'ఆశీర్వచనం ప్రారంభించుతారుట.'

'ఎవరినిరా ఆశీర్వదించేది?'

వచ్చిన మనిషి ఏదో చెబుదామని అనుకున్నాడు, కాని రామచంద్రయ్యగారి వంక చూసి మాట్లాడకుండా వూరుకున్నాడు.

వచ్చిన బ్రాహ్మణులలో ఒక పండు ముదుసలి 'బాబు సాంప్రదాయంగా వస్తున్నవి మనం మానెయ్యడానికి వీలులేదు' అన్నాడు.

రామచంద్రయ్యగారు ఏం మాట్లాడ లేదు.

'బ్రతికి వున్న వాళ్ళకే బాధలు, బాధ్యతలు, బాధతో కూడింది కనుకనే బాధ్యత అని అన్నారు. ఆచరించక తప్పదు'

'ఎంతకాలం యీ బాధ్యతలు?'

'బ్రతికి వున్నంత కాలం!'

రామచంద్రయ్యగారు మాట్లాడకుండా వచ్చి పీటలమీద కూర్చున్నారు.

బ్రాహ్మణులు ఆశీర్వచనం ప్రారంభించబోతున్నారు. ఆపమని రామచంద్రయ్యగారు సౌంజ్ఞ చేశారు.

'ఇప్పుడు మీరు యీ యింటికి వచ్చిన అరిష్టం తొలగిపోయి మళ్ళీ మంచి రోజులు రావాలని కోరడమనే లాంఛనం జరిపించబోతున్నారు. ఇది ఎంత అసంగతంగా వుంటుందో, యీ కాండ ఎంత అసందర్భంగా వుంటుందో, మీ అందరికీ తెలిసిందే. ఈ యింటికి వచ్చిన అనర్థం తీర్చి, మళ్ళీ మంచి రోజులు తెప్పించటం ఎవరికి సాధ్యం?

ఎండిమోడైన వృక్షం చిగురించి మళ్లీ ఫలిస్తుందా!

మొదలు తెగిన తీగె ఎక్కడైనా బ్రతుకుతుందా?

అది దైవానికే సాధ్యం కాదే? మానవులకి ఎల్లా సాధ్యం? దైవమే సాధించలేనిది మానవుడు సాధించగలడా? ఒకవేళ సాధించగలిగితే దైవం, సమాజం హర్షిస్తాయా?

ఈ ఇంటికి, ఇక్కడి వ్యక్తులకు కావలసింది ప్రాయశ్చిత్తం.

ఏ జన్మలోనో ఎవరికో ఘోర అపకారం చేసినందువల్ల కాబోలు నాకున్న యీ సర్వ సంపదలు యీనాడు యిల్లా వ్యర్థమైయ్యాయి.

దైవం లేని ఆలయానికి ఎన్ని అలంకారాలు చేస్తే ఏం లాభం!

నన్ను గురించిన బాధ నాకు ఏనాడు లేదు. నేను బాధ పడేదల్లా సర్వస్వం పోగొట్టుకున్న ఆ అదృష్టహీనురాలిని గురించే.

కర్మ పరిపక్వం లేక పాప లేశమేదో ఋణ శేషంగా మిగిలితే, ఆ ఋణం తీర్చుకుని, తన బాధ్యత వదిలించుకుని, వెళ్లిపోయినవారు అదృష్టవంతులే, కాని ఇక్కడ నిలచిన నాలుగు నాళ్లలోనే నేనూ నావాళ్లూ అంటూ భవబంధాలు ఏర్పరుచుకుని, క్రిందటి జన్మలోని ఋణవిముక్తి కోసమని వచ్చి, యీ జన్మలో క్రొత్త సంకెళ్లని తగిలించుకుని వాటిని త్రెంచలేక, గతాన్ని విస్మరించలేక, మనస్సు మథనమైపోగా, జాగృతికి సుషుప్తికి దూరమైపోగా, వెలుగు నీడల మధ్య క్షోభలో నలిగి, బాధతో దుఃఖంతో స్వర్గానికికూడా అయిష్టంగా వెళ్లిన ఆ ఆత్మకు శాంతికావాలని దీవించండి, ఒకటికి పదిసార్లు ఆశీర్వదించండి.'

రామచంద్రయ్యగారు ఒక్కసారి వాళ్ల వంక కలయజూచాడు. ఎవ్వరూ మాట్లాడలేదు. అంతా శిలాప్రతిమలలాగా ఆయన వంక చూస్తూ కూర్చున్నారు.

'ముందు జరగవలసిన కార్యక్రమం ఏమిటి? ఇక్కడినుంచి బయట పడటం ఎల్లా?'

ఇటువంటి రకరకాల ప్రశ్నలతో మనస్సులు పరుగు లెత్తుతున్నాయి. ఆ ఇల్లంతా మౌనం ఆవరించింది.

ఎటుచూచినా పిడుగుపడ్డంత నిశ్శబ్దం!

'బాబుగారు నేనొక్క మనవి చెయ్యవచ్చునా' అని అంటూ ఒకనడికారు మనిషి లేచి నిలబడ్డాడు.

'చెప్పండి.'

'మీ మనస్సులోని బాధ మాకు తెలియనిదికాదు. ఈ సుఖ దుఃఖాలకు మనమే కర్తలమనే అపోహవల్లనే కదా యీ మానసిక వ్యథ. మనంకూడా నిమిత్త మాత్రులం అని గ్రహించిన రోజున, యీ బాధలు భరించడం రవ్వంత యింకా తేలిక అవుతుందేమో!'

'రాలిపోవడానికి సిద్ధంగావున్న నేను, వేదాంతంలో నన్ను నేను ఓదార్చుకోవచ్చు. కాని చిగురించే లేలేత వయస్సులో, కుమిలిపోయేవారిని ఓదార్చడం ఎల్లా?'

'అన్నిబాధలకు అన్ని గాయాలకు ఒకటే మందు.'

'ఏమిటది?'

'కాలం!'

'వడదెబ్బతిన్న లేత తీగె వర్షాకాలం వచ్చేదాకా తట్టుకుంటుందా?

'వడగొట్టిన ప్రాణికి సేద తీర్చవలసిన బాధ్యత మనదే, సేదతీరిన ప్రాణికి, మనసు తేలిక అయితే, మళ్లీ చిగురించాలని అదే కోరుకుంటుంది. ఆనాడు దానికొక ఆలంబన చూపిస్తే అది విరబూసి మూడు పువ్వులు ఆరు కాయలు అవుతుంది.'

'సంఘం ఒప్పుకుంటుందా!'

మన మతాన్ని సరైనదృష్టితోచూసి నెమ్మదైన మనస్సుతో ఆకళింపు చేసుకోండి. ప్రకృతికి విరుద్ధంగా మానవుడిని బ్రతకమని ఏ మతం ఏ ఆచారం శాసించదు.'

'మరి యీనాడు?'

విజ్ఞాన వివేక రహితులైన మూర్ఖులే మతానికి ఆచారానికి అపార్థాలు కలిపించి మానవజాతికి తీరనిఅపకారం చేస్తున్నారు.'

'పోయినవారి ఆత్మ యీ అనాచారాన్ని హర్షించదేమో!'

'వైతరణి దటడానికి ఆయత్త మవుతున్న ఆత్మ, యీ మర్త్య లోకంలోని కట్టుబాటులని గురించి బాధపడుతుందని మీరనుకుంటున్నారా?'

'ఐతే యీ కర్మకాండ, యీ ఆచారం, ఉపయోగం'

'మన మనశ్శాంతికి.'

'మరి యీ దుఃఖం? యీవేదనా?

'క్షణికం'

'అంతేనా?'

'అంతే'

రామచంద్రయ్యగారు తలవంచుకుని మౌనంగా కూర్చున్నారు. బ్రాహ్మణులు యీ సంకేతాన్ని గ్రహించారో ఏమో? వేదఘోషలో, ఆవాడ వాడంతా నిండిపోయింది.



## ...మరణాంధ్రపథమ్

అనుకున్నదానికంటె ఎక్కువగానే సంభావనలు పొంది బ్రాహ్మణులు వెళ్లిపోయారు.

వచ్చిన బంధుకోటి ఎవ్వరితోను చెప్పకుండా తమ తమ నెలవులకు తరలిపోయారు.

నిశ్శబ్దం రామచంద్రయ్యగారికి తోడుగా మిగిలింది, సావిడిదాటి యింట్లోకి వెళ్లారు.

ఒక ముత్తైదువ నడవలో కూర్చొనివుంది.

'శ్యామల ఎక్కడవుంది?' అని రామచంద్రయ్యగారు అడిగారు.

'గదిలో పడుకునివుంది'

గది గుమ్మందగ్గరకు వెళ్లి నిలబడ్డాడు. గదిలో నేలమీద, పసుపూ కుంకుమకు నోచుకోని ఆ పడుచుపిల్ల పడుకునివుంది.

'తల్లీ!' అని పిలిచారు.

ఆ అమ్మ పలుకలేదు.

గదిలోకి వెళ్లబోయిన మనిషి వెనక్కి తిరిగారు. పూజగృహంలోకి దారితీశారు.

ఇన్నిరోజులుగా పూజా పునస్కారంలేక ఆగదిలోని దేముడుకూడా ఉపవాసాలు చేసినవాడిలాగా కళాకాంతులు లేకుండా వున్నాడు.

రామచంద్రయ్యగారి మనస్సులోంచి వేడినిట్టూర్పు వచ్చింది. అంతలోనే మనస్సులో ఏదో ఆలోచన మసలింది. అడుగు వెనక్కి తిరిగింది.

పుస్తకాల గదిలోని రామాయణం తెరిచారు. చదవటం మొదలుపెట్టారు.

మరణించిన ఇంద్రజిత్తుతో సహగమనం చెయ్యటానికి, సతీసులోచన చితిపై కూర్చోంది. ఈదృశ్యాన్ని చూసిన రావణాసురుడు.

'మీ ఇద్దరికి యీ మహాసామ్రాజ్యాన్ని పట్టంగట్టి, మీరు సకలవైభవోపేతంగా రాజ్యంచేస్తూవుంటే, మనస్సున నిశ్చింతతో, నిండిన ఆనందంతో నేను నా ధర్మపత్నితో వానప్రస్థం స్వీకరించుదామని ఎన్నాళ్లగానో ఎదురుచూశాను. కాని విధి వక్రించింది. ఈనాడు మీయిద్దరిని యింధన సింహాసనంపై కూర్చోపెట్టి స్వర్గలోక సామ్రాజ్యానికి పట్టం గడుతున్నాను తల్లీ!'

ఆపుస్తకం మూసేసి బీరువాలో పెట్టేశారు. ఇంకొక పుస్తకం తెరిచారు. ఆయన కంటబడిన వాక్యం.

'నాయనా లోహితా!'

ఆయన మనసులో మసలిన మాట—

'నాయనా శంకరం!'

నాయనా శంకరం! ఎందుకు నాయనా ఇంత అన్యాయంగా ప్రవర్తించావు! మేము ఏం అపకారం చేశామని, ఇంత కోపంగా హఠాత్తుగా వెళ్లిపోయావు!

ఇరవై ఆరుసంవత్సరాల క్రితం యీ ఇంట్లోనే ఒక్కసారిగా వెయ్యి దీపావళి పండుగలు జరిగినంత ఆనందం కలిగింది. మా ఇలవేల్పు సాక్షాత్తు పరమశివుడే యీ రూపంలో యీ ఇంట్లో వెలిశాడనిపించింది. మేము చేసిన పూజలు ఫలించాయి.

జీవితంలో సగ భాగం గడిచిపోయి, ప్రొద్దు వాటారబోతున్న మా బ్రతుకులోకి చల్లని చందమామలాగా వచ్చావు.

ఆనాడు మా మనుగడకు ఒక అర్థం, మా జీవితాలకు ఒక ఉపయోగం కనిపించాయి. మా జీవితాలు వ్యర్థమేమోనని ఇంతకాలం బాధపడిన నేను, గొడ్రాలు అనే మాయని మచ్చతో జీవితమంతా గడపవలసి వస్తుందేమోననే బాధతో అనుక్షణం పూజలతో పునస్కారాలతో తపించిపోయిన మీ అమ్మ నోముల పంటలాగా మా యింట్లో వెలిశావు.

ఆనాడు మా మనస్సులలో ఎటు చూశినా వెలుగే, వెన్నెలే! పెళ్లికంటె వైభవంగా నీ బారసాల జరిపించాము. నీ జాతక చక్రం వేసిన జోస్యులవారు ఏమన్నారో తెలుసా?

ఈ చిరంజీవి తన పేరు చిరస్థాయిగా నిలుపుకుంటాడు అని. నీకు గుర్తుందా నాయనా శంకరం, నీ అక్షరాభ్యాసానికి రాజాగారిని అడిగి ఏనుగు తీసుకుని వచ్చాను.

నిన్ను ఆశీర్వదించడానికి వచ్చిన పండితులు ఏమని దీవించారో జ్ఞాపకం వుందా?

'సకల విద్యా ప్రాప్తిరస్తు!'

నిజమే నాయనా సకల విద్యలు నీకు అబ్బినాయి. స్కూలు ఫైనలులో రాష్ట్ర

ముతో మొదట వాడవు నీవేగా!

పీ. యూ. సీ. లో విశ్వవిద్యాలయంలో క్రొత్త రికార్డు స్థాపించినవాడివి నువ్వేగా.

ఎమ్. ఎ. లో గోల్డు మెడలు నీకేగా వచ్చింది.

నీకు మంచిచదువు వచ్చిందంటే అది మీ అమ్మ చేసిన అదృష్టం అని అనుకున్నాం.

నీకు మంచి ఉద్యోగం వచ్చిందంటే అది నీ భార్య చేసిన పూజా ఫలం! అని అన్నారు.

పెళ్లిలో మీ యిద్దరిని చూశినవారు ఏమన్నారో తెలుసా? రతీ మన్మధులలాగా వున్నారని.

మీ అమ్మ ఎప్పుడగా అదృష్టవంతురాలే. రాములవారివంటి కుమారుడిని కన్నది. సీతమ్మ వారిలాంటి కోడలును తెచ్చుకుంది! అన్ని ఆనందాలు చూచుకుని ఇంత పసుపూ కుంకంతో వెళ్లిపోయింది. సర్వస్వం మీకు అప్పచెప్పి యీ విధుర జీవితం భగవన్నామస్మరణలో గడుపుదామని మభ్యపడ్డాను.

ఇందరి ఆశలు నమ్మకాలు తప్పని అడియాశచేసి నువ్వు వెళ్లిపోయావు.

ఎందుకని శంకరం?

నీ మనస్సు నొప్పించే పని ఏదైనా చేశామా నాయనా? నీవాళ్లమీదనే ఎందుకయ్యా ఇంత కోపం!

'జాతస్య మరణం ధృవమ్!' అని నాకూ తెలుసు శంకరం. కాని నేను ముందుగా వెళ్లడం న్యాయం. ఔచిత్యం కూడా అదే.

కాని యిలా సంఘ విరుద్ధంగా నువ్వు వెళ్లిపోతే అందరికీ ఎంత బాధాకరంగా వుంటుందో నువ్వే చెప్పు!

పోనీ నేనంటే పరాయివాడిని! నీలో సగ భాగమైన ఆ యిల్లాలని చూడవయ్యా! లేతవయస్సులోని మనిషిని యిల్లా చెయ్యడం అన్యాయం కాదా శంకరం!'

'పెద్ద బాబుగారు! పెద్ద బాబుగారు!' అంటూ ముత్తైదువ కంఠం వినిపించింది.

రామచంద్రయ్యగారు ఉలిక్కిపడి 'ఏమిటి!' అని అన్నారు.

'అమ్మాయి మాట్లాడటంలేదు'

రామచంద్రయ్యగారు ఒక్కంగలో ఆ గదిలోకి వెళ్లారు. 'అమ్మా శ్యామలా ఇటు చూడుతల్లి! అని గద్గదస్వరంతో పిలిచారు.

అంతా నిశ్శబ్దం!

శ్యామల పలకలేదు. కన్నెత్తి చూడలేదు. రామచంద్రయ్యగారు శ్యామల ప్రక్కనే నేలమీద కూర్చున్నారు.

'అమ్మా శ్యామలా!' అంటూ ఆ పిల్ల ముఖంవంక చూశారు.

ఏదో చెప్పబోయారు.

వెయ్యి కంఠాలతో ఎవరో చెబుతున్నట్లు అనిపించింది. వెయ్యి చేతులతో ఎవరో కంఠాన్ని నొక్కినట్లు అనిపించింది.

బిగపట్టిన పిడికిలిలో తెల్లటి కాగితం మీద నల్లటి అక్షరాలు కనిపించాయి. నిండు పున్నమిలాంటి శ్యామల వదనంలో అమావాస్య కప్పివేశింది.

కట్టె వున్నది కాని హంస లేదు.

హృదయాన్ని చీల్చుతూ కట్టలు తెగిన శోకాన్ని దాటుకుంటూ రామచంద్రయ్యగారి నోటివెంట ఒకేఒక వాక్యం వెలువడింది.

'సహగమనం చేశావా తల్లీ!!' ●



# ఆఫీసుకు ఆకర్షణ!



ఖీరావారి ఆఫీసు ఫర్నిచరు పెట్టుకొంటే మీ ఆఫీసు చూడ ముచ్చటగా ఉంటుంది. అక్కడ పని కూడ చురుకుగా జరుగుతుంది. పనిచేసుకొనుటలో ఎంతో అనువుగా ఉండేలా ప్రత్యేకమైన డిజైనులలో తయారైన యీ అందమైన ఫర్నిచరు, ఆఫీసులకు ఆకర్షణా, ఘనతా చేకూరుస్తుంది! అందుకనే నేడు ఆధునికమైన ఆఫీసు ఫర్నిచరు కావాలనే వారు ఖీరా ఫర్నిచరునే కొంటారు!

జూనియర్ ఎగ్జిక్యూటివులకు



అన్ని డెస్కులు, టేబుల్లు హార్డ్‌బోర్డ్ లేక ఆకర్షణీయమైన లెమినేటెడ్ ఉపరి భాగములు కలవి లభిస్తున్నాయి.

అసిస్టెంటులకు మరియు టైపిస్టులకు



Khira

ఖీరా స్టీల్ వర్క్స్
ప్రైవేట్ లిమిటెడ్
స్వామి వివేకానంద రోడ్,
శాంతా క్రూజ్, బొంబాయి

# వారఫలం

**23-2-68 శుక్రవారం మొదలు 29-2-68 గురువారం వరకు**

**మేషం:** వృత్తి వ్యాపారాల్లో ఇదివరకు ఆగిపోయిన వ్యవహారలను యిప్పుడు పూర్తి చేయగలరు. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. విద్యా వైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. రాజకీయ వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి. దైవ కార్యాలు నెరవేరతాయి.

స్త్రీలకు:—కుటుంబ వ్యవహారాలు సామాన్యంగ ఉంటాయి. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**వృషభం** వారం ప్రారంభంలోనే వృత్తివ్యాపారాల్లో చికాకులు యేర్పడి తరువాత సర్దుకొంటాయి. సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. ఉద్యోగంలో గౌరవం బాగా ఉంటుంది. ప్రయాణాలోచనలు చేస్తారు.

స్త్రీలకు:—ఆరోగ్యం బాగా ఉండదు. సంతోషకరమైన వార్తలను వింటారు.

**మిధునం:** ఏవ్యవహారంలోను విశేషమైన అనుకూలతను ఆశించడానికి అవకాశం లేదు. వృత్తిలో ముఖ్యమైన వ క్తులను కల్సుకొంటారు. వారం మధ్యలో చికాకులకు గురి కాగలరు. ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది. కోర్టు వ్యవహారాలు బాగా ఉంటాయి.

స్త్రీలకు:—కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. అధిక వ్యయం జరుగుతుంది.

**కర్కాటకం** కొన్నివ్యవహారాలు సులువుగానెరవేరినా మరికొన్నింటిలో శ్రమ కలుగుతుంది. వ్యాపారం భారీయెత్తున చేయడం వలన ఆర్థికంగా ఒత్తిడి వస్తుంది. ఉద్యోగంలో యెవరినీ విశేషంగా నమ్మడం తగదు. సాటివారిలో గౌరవం బాగా ఉంటుంది. ప్రయాణాల్లో శ్రమకలుగుతుంది.

స్త్రీలకు.—ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. బంధుమిత్రులను కల్సుకొంటారు.

**సింహం:** మీాకు ముఖ్యందు లాభించగల వ్యవహారాల్లో అభివృద్ధిని సాధించ గలరు. వ్యాపారంలో నూతనావకాశాలు లభిస్తాయి. ప్రయాణం ద్వారా కార్యసాధన చేయగలరు. రాజకీయ వ్యవహారాల్లో ప్రతిపక్షాల సంచలనం పెరుగుతుంది. సజ్జన సాంగత్యం లభిస్తుంది.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. ఆడంబరం కోసం వ్యయం చేస్తారు.

**కన్య.** ఇతరుల నిమిత్తం చేసే ప్రయత్నాలు సులువుగా నెరవేరతాయి గాని మీా స్వంత పనుల్లో శ్రమ కలుగుతుంది. వృత్తిలో సాటివారితో పోటీ పెరుగుతుంది. సాహసముతో కూడిన వ్యవహారాలు స్వల్పంగా లాభిస్తాయి. స్థిరాస్థి వ్యవహారాలు అనుకూలంగ ఉంటాయి.

స్త్రీలకు:—ఆరోగ్యం బాగానే ఉంటుంది. పుణ్య కార్యాలు చేస్తారు.

**తుల:** వృత్తి వ్యాపారాల్లో మీా కార్యక్రమాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. ఉద్యోగంలో మిత్రులకు ఉపకారం చేయగలరు. రాజకీయ వ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. ప్రయాణాలు ఫలిస్తాయి. ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి.

స్త్రీలకు:—కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. సంతోషకరమైన వార్తలను వింటారు.

**వృశ్చికం:** భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాలు అనుకూలంగా ఉంటాయి. అధికారులవలన జరగవలసిన వ్యవహారాలు సులువుగా నెరవేరతాయి. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. మిత్రుల సహాయం లభిస్తుంది. వృత్తిలో అనుకూల వార్తలను వింటారు.

స్త్రీలకు:—ఆరోగ్యం బాగా ఉంటుంది. శుభకార్యాల విషయంలో అభివృద్ధిని సాధించ గలరు.

**ధనుస్సు:** మీా ఆత్మ విశ్వాసమే అన్ని వ్యవహారాల్లోను అనుకూలతను సాధించ గలదు. మీాకు యిష్టం లేకపోయినా, మిత్రుల వ్యవహారాల్లో జోక్యం చేసికోవలసి వస్తుంది. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. ప్రయాణం ద్వారా కార్యసాధన చేయగలరు. సజ్జన సాంగత్యం లభిస్తుంది.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**మకరం.** లాభం రావలసిన వ్యవహారాల్లోనే నష్టం వచ్చే పరిస్థితి యేర్పడుతుంది. సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది. వారం మధ్యలో అనుకూలత లభిస్తుంది. వ్యాపారంలో ఆదాయం బాగా ఉంటుంది. అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు బాగా ఉంటాయి.

స్త్రీలకు:—ఆరోగ్యం బాగా ఉండదు. నూతన విషయాలను తెల్సుకొంటారు.

**కుంభం** వ్యాపారంలో మీారు యిదివరకు చేసిన ప్రయత్నాలు ఫలించగలవు. రావలసినడబ్బు సమయానికి అందుతుంది. వారం మధ్యలో ఆకస్మికంగా చికాకులు యేర్పడతాయి. మీా తాలూకు వస్తువులు పోయే ప్రమాదం ఉంది. రాజకీయ వ్యవహారాల్లో శ్రమకలుగుతుంది.

స్త్రీలకు:—కుటుంబ వ్యవహారాల్లో అధికవ్యయం జరుగుతుంది. సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి.

**మీనం** వృత్తివ్యాపారాల్లో మీా కార్యక్రమాలు ఒడుదుడుకులు లేకుండ నెరవేరతాయి. ప్రయాణాలు ప్రోత్సాహకరంగ ఉంటాయి. వ్యాపారంలో నూతనావకాశాలు లభిస్తాయి. వారం ఆఖరులో సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది. మీాతాలూకు వస్తువులు పోయేప్రమాదం ఉంది.

స్త్రీలకు.— ఆరోగ్యం బాగానే ఉంటుంది. బంధువులకు సహాయం చేస్తారు.

—మహేష్



# మూడు ముళ్ళు

అచ్యుతవల్లి

జరిగిన కథ

కవిరాజ ధన్వంతరీ నిలయం వరదయ్యగారికి ఇద్దరు కూతుళ్ళు, ఇద్దరు కొడుకులు. పెద్దపిల్ల కామేశ్వరి. పెళ్ళికి ఎదిగి వుంది. తర్వాత వాడు చిట్టిబాబు కాలేజీలో చదువుతున్నాడు. తర్వాతది సుభద్ర. చిన్నవాడు జగ్గూ సెకండ్‌ఫారం చదువుతున్నాడు. భార్య జగదాంబ, పిల్లలూ అంతా ఆయన సంపాదన మీదే ఆధారపడి వున్నారు. కామేశ్వరి కంటె సుభద్ర అందంగా వుంటుంది. కామేశ్వరికి ఇరవై సంవత్సరాలు నిండినా ఏ ఒక్క సంబంధమూ స్థిరపడడం లేదు. వస్తూపోతూ వున్నట్టుగానే, ఆ రోజు కూడా ఒక సంబంధం వచ్చింది. రెండవ పెళ్ళివాడైన కేశవమూర్తితో కామేశ్వరికి వివాహమైపోయింది. కామేశ్వరి అభిరుచిని తెలుసుకున్న కేశవమూర్తి ఆమెని నళినితోపాటు చదువుకోడానికి కాలేజీకి పంపుతాడు.

## 6

నళినీ, మాధవా, తిన్నగా, బీచ్‌వెంపు వెళ్ళారు! మాధవ, నళినితో తీరిగ్గా మాట్లాడాలని అనుకొన్నాడు. నళిని కూడా మాధవ అంటే, మంచి ఇష్టం చూపుతో వుంటుంది. మాధవ అందమైనవాడు! చురుకైనవాడు! కమ్మని కథలు వ్రాస్తాడు! తియ్యని గొంతుతో పాటలు పాడుతాడు! తల్లి తండ్రుల కొక్కడే కొడుకు! పెద్దింటి పిల్లల ప్రేమకూడా మెరకనీరు పల్లపు భూమికే ప్రవహిస్తుంది, అన్న సామెత రీతిగావుంటుంది కాబోల్ను!

సముద్రతీరంలో, మనస్సుల్ని ఆహ్లాదపరిచే చల్లనిగాలి విసుర్లలో. ఉవ్వెత్తుగా లేచిపడే సముద్ర కెరటాల చివర్ల మెరిసే పాలనురుగులని చూస్తూ.

'చూడు నళినీ! నిన్నొక విషయం అడగాలనుకుంటున్నాను' అన్నాడు మాధవ!

మురిసిపోయింది నళిని!

'నిన్ను మనసారా ప్రేమిస్తున్నాను! నువ్వనుగ్రహిస్తే కాని బ్రతకలేను! నేను నీ స్టేటస్‌కి తగకపోయినా' నిన్ను ఆరాధించకుండా వుండటం నా శక్తికిమించిన పనిఅని తేలిపోయింది.' అన్న ప్రేమభాషణ వూహించింది నళిని. సిగ్గుతో బుగ్గలు ఎరుపెక్కిపోగా, ఇసుకరేణువుల్ని కరిగించే, సముద్రుని వెంపు చూస్తూ—

'అడుగుమాధవ్! సందేహం దేనికి!' ఉత్సాహంగా అంది నళిని.

'అదే! మీఇంట్లోవుంటోందే! ఆవిడ! ఆ కామేశ్వరి విషయం!' నెమ్మదిగా నళిని వెంపుచూస్తూ అన్నాడు మాధవ. క్షణం సేపు నళినిముఖం, వివర్ణమైపోయింది. మళ్ళీ స్థిమితం చేకూర్చుకుని—

'వూఁ! కామేశ్వరి విషయం ఏమిటి!' వ్యంగ్యంగా అంది నళిని.

'నువ్వు నాకు అత్యంత ప్రీతి పాత్రురాలివి నళినీ! నీముందు నాకు దాచుకోగల రహస్యములు వుండజాలవు! అంచేత నీకు మటుకే ఈ రహస్యం చెబుతున్నాను. ఇంకెవరికీ చెప్పవుకదూ! చెబితే అపహాస్యం పాలు కావాల్సివస్తుంది!' అన్నాడు మాధవ!

ఈ వుపోద్ఘాతం నళినికి విసుగెత్తించింది. అయినా నిగ్రహించుకుని, అసలు విషయం రాబట్టాలని,

'వూఁ ఇంతకి అసలు సంగతి చెప్పు!' అంది.

'మా అన్నయ్యని నీవు చూచావుగా!'

'వూఁ!'

'వాడు కామేశ్వరిని ప్రేమించాడు! ఆమెని చూచినది మొదలు ఇంకే సంబంధాలు వచ్చినా నచ్చలేదని ఏవేవో సాకులు చెప్పి పెళ్ళి చేసుకోవటంలేదు! అంచేత కామేశ్వరితో ఈ విషయం చెప్పి ఎలాగయినా అన్నయ్యతో ఆమె మాట్లాడేట్లు చేయి! నీ కెంతయినా పుణ్యముంటుంది. నేను ఆమెతో ఎన్నోసార్లు మా అన్నయ్య సంగతి చెప్పాలని ప్రయత్నించాను. కాని ఆమె నాతో మాట్లాడటానికి అట్టే సుముఖురాలుగా వుండటం లేదు. ఎందువల్లో! మనం ఇరువురం ప్రేమికులం! ప్రేమించుకున్నవాళ్ళకి ఎడబాటు ఎంత దుస్సహంగా వుంటుందో మనకు అనుభవంలోనికి వచ్చిన విషయమేకదా! కామేశ్వరి మీ ఇంట్లో వుంటుంది కనుక నువ్వీ విషయంలో మాకు సాయం చేయొచ్చును' అన్నాడు మాధవ. నళినికి నవ్వు వచ్చింది! ఈ అందచందంలేని నిర్ధనురాలైన కామేశ్వరికి కూడా ఒక ప్రేమికుడూ, ఆరాధకుడూ వున్నాడన్న సంగతి వినగానే ఆమెలో ఒక హేళనాభావం ఉత్సాహంగా పొంగులువారుతూ పరుగు లెత్తసాగింది! ఆ కారణంగా కామేశ్వరికీ, తమకూ వున్న బాంధవ్యం విశదీకరించి మాధవకు చెప్పాలనే సంగతి విస్మరించింది నళిని!

'మీ అన్న కామేశ్వరిని ఎట్లా ఎరుగును?' అడిగింది నళిని.

'మామూలుగా కామేశ్వరిని పెళ్ళిచూపులకు చూచేందుకు వెళ్ళాడు! చూసాడు!'

'అప్పుడు నచ్చలేదా?' లాయరులా అడిగింది నళిని.

'నచ్చిందనీ మా నాన్నారితో చెప్పాడు మా నాన్నారు వారికి వారికి ఆ విషయ్న

తెలియజేశ్వారుకూడా!"

'మరయితే పెళ్లి ఎందుకు అవలేదు?' అంది.

'అదంతా ఒక విచిత్రం నళినీ! మేము చూసివచ్చి, నచ్చిందని, జాబు వ్రాసేక; ఎవడో ఒక ప్రొఫెసర్, ఆమెని కట్నం లేకుండానే పెళ్లాడుతానని అన్నాడని, అంచేత కట్నం లేకుండ అయితేనే మా అన్నకు మొదటిసారి ఇస్తానన్నారు కనుక చేస్తామనీ, ఆమె తండ్రి వ్రాశాడు! వాళ్ల తలబిరుసుతనానికి, లౌక్యానికీ మా నాన్నారికి కోపంవచ్చి వద్దనేసారు! తీరా కార్యానికి వచ్చేసరికి, వాడూ చేసుకోనన్నాడు కాబోలు! ఇక్కడ చదువుకు చేర్చారు!' అన్నాడు మాధవ! అప్పుడన్నా కామేశ్వరి వివాహిత అనీ, తమయింటి కోడలనీ చెప్పలేదు నళినికి! ఆమెకు చెప్పాలన్న ఆలోచన కలగలేదు!

'మీ అన్నకూడా కట్నాని కాశించకుండానే చేసుకుంటానంటే సరిపోయింది! అప్పుడు మీ అన్నకే ఇద్దరు ఆమెని! కట్నం కోసం మనసుకు నచ్చిన జీవనభాగస్వామిని వదులుకుంటారా నేటి చదువుకున్న యువకులు? అందులో మీ అన్న స్వయం పోషకుడుకూడా కదా!' అన్నది నళిని వచ్చే నవ్వుని పెదాలమధ్య బిగించి.

'ఆ అవకాశం ఏది నళినీ! మా అన్న మంచి గుట్టుకలవాడు! కామేశ్వరిని చూసి వచ్చేక, ఎన్ని సంబంధాలు చూస్తున్నాడో! కాని ఒక్కటీ వాడి మనస్సుని ఆకర్షించలేకపోతూందంటే కారణం ఏమిటంటావు? ఆ కారణం నాకే తెలుసు నళినీ! ఒక్క నాకే తెలుసు! వాడి మనస్సులో కామేశ్వరి తిష్ఠవేసుకుని కూర్చుందని నాకే తెలుసు! వాడి హృదయం మలుచుకొన్న అపరంజి బొమ్మ కామేశ్వరి! ఎల్లా ఆమెని అంత తేలిగ్గా మర్చిపోయి పెళ్లికి ఒడబడతాడు నళినీ వాడు! వాడి హృదయం అతి గంభీరం! వాడు సముద్రుడు నళినీ! నాకు తెలుసు వాడి క్షోభ! అందుకనే, నిన్ను ప్రాధేయపడుతున్నాను! నువ్వు కామేశ్వరిని మాతో చనువుగా వుంటానికి ప్రోత్సహించాలి! వాళ్లిద్దర్నీ ఒకటి చేస్తే మన జీవితాలు ధన్యమవుతాయి!' అన్నాడు మాధవ! ఆవేశంతోవున్న మాధవని చూసి చిన్నగా నవ్వింది నళిని! మాధవ ఆమె చేతులు రెండూ పుచ్చుకుని, పెదాల కానించుకున్నాడు. నళిని అతనిలోనికి కరిగిపోయింది!

* * *

హాలులో మాధవ గొంతు వినగానే మెడమెట్లు దిగుతూన్న కామేశ్వరి క్రిందికి తొంగిచూసింది. మాధవ ప్రక్కన రామనాథంకూడా కూర్చునివున్నాడు. రామనాథాన్ని చూసిన జ్ఞాపకంలేదు కామేశ్వరికి! మాధవనంటూకు, తనని చూసుకుందుకు వచ్చిన వాళ్లతో వున్నాడని, జ్ఞాపకం



వుంది కామేశ్వరికి ! ఆరోజు ఆమె, తనని చూసుకుందుకువచ్చిన యువకుణ్ని పరీక్షగా చూడనే లేదు! మాధవ మటుకు ఎక్కువ మాట్లాడటంవల్ల ఆమెకు బాగా గుర్తు వుండిపోయింది. వెను తిరిగి పైకి పోబోతున్న కామేశ్వరిని చూసింది నళిని.

'రా కామేశ్వరీ! ఇంట్లోకివెళ్లి మూడు కాఫీలు పట్రా!' అంది నళిని. మెట్లు దిగి వెను తిరిగి ఇంట్లోకి పోతూవున్న కామేశ్వరి వీపుమీది పొడుగాటి జెడని అమితాసక్తితో చూస్తూన్న రామనాధంని చూసి నవ్వుకొంది.

'కామేశ్వరి జుత్తు బాగుంటుందికదూ! స్త్రీలకు నిడుపాటి కురులే అందమన్నారు మన పూర్వీకులు! సర్వేంద్రియాణాం నయనం ప్రధానం! అని కూడా అన్నారు. నేత్రాలూ, కురులూ కామేశ్వరి యొక్క అందానికి తిరుగులేని ప్రతినిధులు! ఏమంటారు? అంది నళిని!

రామనాధం సిగ్గుగా తల క్రిందికి దించుకున్నాడు!

'మీ అన్నగారికి బిడియ మెక్కువ మాధవ్! మా కామేశ్వరి సరేసరి నోరు తెరవదు! ఇంకెల్లా వీళ్లు వకరొకరి మనోగతాలు వివరించుకునేది?' ఎద్దేవాగా అంది నళిని.

# మహాడువమంళ్లా

మాధవ ఫ్రీగా నవ్వాడు.

'వాళ్లకి కావల్సినది ఏకాంతము నళిని!' ఎవరూ లేనీ యమునా తటినీ ఎక్కడో ఏకాంతమందున వారిరువురూ ఒకరినొకరు ఎరుకపర్చుకుంటారు! మనలా నలుగురిలో వుండి మాట్లాడుకోమంటే వాళ్లు గొప్ప అవమానంగా భావిస్తారు' అన్నాడు మాధవ!'

'ఏమిట్రా ఆ ధోరణి!' కోపంగా అన్నాడు రామనాధం.

'కావ్యనాయిక మళ్లె కోపం అభినయిస్తున్నారు. మీ అన్న!' అంది నళిని.

'అదికాదు అన్నయ్యా! నువ్వే పెళ్లికూతురయినట్లు సిగ్గుల సింగారం ఒలకపోస్తూంటే కాస్త మేలమాడాము! దానికికినుక వహించితే మరి ఎటుల నాటకము సాగనోపును?' భావ యుక్తంగా అన్నాడు. మాధవ!

'నీ కపిత్వం కట్టిపెట్టు బాబూ!' అన్నాడు విసుగ్గా రామనాధం.

'రవిగాంచనిచో కవిగాంచునని కొండొకచో వివరింపబడివె!' అన్నాడు అల్లరిగా మాధవ! నళిని, చప్పట్లు కొట్టుతూ 'హియర్ హియర్!' అంది.




'ఆయనతో మాట్లాడి గెలవలేమండీ! ఆయన మనస్సుల్ని చదువుతారు!' అంది నళిని.

'ఆఁ! బాగానే చదువుతాడు చదువు, అస్తమానూ కాగితాలు నలుపుచేస్తూ, కూర్చోటమేకాని అసలు చదువు చదివితే కదా వీడు పరీక్షలు ప్యాసయ్యేది?' ఇంతలో కేశవ వచ్చాడు. రామనాధం మాధవాలేచి నిలబడి.

'నమస్కారం మాస్టారూ!' అన్నారు వక్కసారిగా!

'విజయోస్తు! ఎల్లా వున్నారు? పాఠాలు వంట పట్టుతున్నాయా! నువ్వు ఎంఎకి అప్పియర్ అవుదామనుకుంటున్నావుట! మొదలుపెట్టావా చదవటం!' రామనాధాన్ని వుద్దేశించి అన్నాడు కేశవ!

'ప్రయివేటుగా ఎంతబాగాచదివినాక్లాసు తెచ్చుకోవటం కష్టమండీ. వుద్యోగం పర్మనెంట్ అయినాక స్టడీలీవ్ పుచ్చుకుని, కాలేజీలో జేరదామని అనుకుంటున్నానండి!' వినయంగా అన్నాడు రామనాధం.

'అల్లాచేస్తే, బాగావుంటుంది!' అన్నాడు కేశవ! కామేశ్వరి ట్రేలో మూడుకప్పులు కాఫీతెచ్చి టీపాయ్‌మీద పెట్టింది! రామనాధం చేతులు కాఫీకప్పు పట్టుకుంటూంటే వణికాయ్! ఆనాడు, తెల్లనిచీరలో, మల్లెమొగ్గలా, ముడుచుకు పోయివున్న కామేశ్వరి, ఈ రోజు ధైర్యంగా, నలుగురికీ, కాఫీలిచ్చి, తలెత్తుకుని, నిలబడింది! పరిస్థితుల ప్రభావము! అనుకున్నాడు రామనాధం!

కామేశ్వరి వాళ్లు కాఫీలు త్రాగే దాకా నిలబడింది. కేశవకాని నళినికాని ఆమెని కూర్చోమనక పోవటం మాధవకి ఆశ్చర్యం కలిగించింది! వాళ్లుముగ్గురూ, కాఫీలు త్రాగగానే, కాళీకప్పులు, తీసుకుని! లోనికి వెళ్లిపోయింది. ఆమె వెళ్లిపోతుంటే ఆమెకేసి వకసారి చూసాడు రామనాధం! ఆ చూపులోని ఆనందాన్ని తడవగలిగిన మాధవ నళినివైపు చూసి చిన్నగా నవ్వుకున్నాడు!

'నీవేదో నవల వ్రాస్తూన్నవని, మా నళిని చెప్పింది. ఎంతవరకూ వచ్చింతోయ్! ఇంతకీ అది చరిత్రాత్మకమా,

గురిపెట్టండి - క్లిక్ చేయండి....




...ప్రతిసారి ఉత్తమ ఫొటోలు తీస్తుంది

Agfa క్లిక్ III




అమర్చుకొనే అవసరంలేదు—తప్పులకు అవకాశంలేదు.
12 పెద్ద (6×6 సెం.మీ.) ఫోటోలు ప్రతి రోలు ఫిల్ము మీద వస్తాయి.
ఎవరెడీ కేసు పోర్ట్రేట్ లెన్సు, ఫ్లాష్‌గన్ ఖర్చు అదనం.

Agfa క్లిక్ III - మొదలు పెట్టుటకు శ్రేష్ఠము-వదలిపెట్టుటకు కష్టము!



ఆగ్ఫా పైవిచారణ క్రింద తయారుచేయువారు: ది న్యూ ఇండియా ఇండస్ట్రీస్ లి., బరోడా, పోల్ దిస్త్రి బ్యాటర్లు.

ఆగ్ఫా-గేవర్ట్ ఇండియా లిమిటెడ్, బొంబాయి . న్యూఢిల్లీ . కలకత్తా . మద్రాసు

కళకళలాడే ప్రింట్లకు, ఎన్లార్జ్‌మెంట్లకు ఆగ్ఫా ఫొటోపేపర్లు మాత్రమే కావాలని అడగండి!

సాంఘికమా ?' అన్నాడు కేశవ.

'చరిత్రాత్మక నవలలు వ్రాయటము, అంత తేలికాదండీ! దానికి బోలెడు పరిజ్ఞానం వుండాలి! రాజుల సమయాలూ, స్థలనిర్ణయాలూ, వివరంగా తెలిసివుండాలి! వాళ్ల దుస్తుల వివరాలూ, ఆభరణాల వివరాలూ సేకరించాలి! అందుకని నేటి రచయితలు, క్లిష్టమైన చరిత్రాత్మక చిత్రణకు పూనుకోవటం లేదు! సాంఘికాలయుగం అయిన ఈ రోజుల్లో నేనూ ఒక సాంఘిక సమస్య నాధారంగా చేసుకుని ఏదో వ్రాస్తున్నాను. పూర్తి అయిపోవచ్చింది లెండి!' అన్నాడు మాధవ!

'సాంఘిక సమస్య అంటూ చెప్పకొస్తున్నారు కదా! కాస్త ఆ సాంఘిక సమస్య ఎలా వుంటుందో దాని స్వరూపం చెప్తారా?' అంది నళిని.

'సమస్య అంటే ఏమిటి? తీరీతీరని కోరిక అనుకోవచ్చును! తిండిలేనివాడికి తిండి దొరకాలనేది ఒక సమస్య అయితే ఉద్యోగం లేనివాడికి ఉద్యోగం దొరకాలనేది ఒక సమస్య! ఆహారసమస్య, నిరుద్యోగ సమస్య, వివాహ సమస్య! ఇలా సమస్యలు అనేకవిధంగా ఒక్కొక్క వ్యక్తికి ఒక్కొక్కలా వుంటాయి! ఆ సమస్యల్ని ఎదుర్కొని పరిష్కరించుకోవాల్సిన వాళ్లే వ్యక్తులు! ఇవన్నీ సాంఘిక సమస్యల క్రింద వస్తాయి! వ్యక్తిగత సమస్యలు అంటూ కొన్ని వున్నయ్! వర్ణభేదాలూ, వర్గభేదాలూ సామూహిక సమస్యలు! రకరకాల సమస్యలతో వేగిపోతూ జీవిస్తున్నారు వ్యక్తులు.' అన్నాడు మాధవ!

'సమస్యలు లేని వ్యక్తులు వుండరా!' హేళనగా అంది నళిని.

'వుంటే వాళ్లు అదృష్టవంతులు నళినీ! సమస్యలు లేని వ్యక్తులు వుండవచ్చును కాని, వ్యక్తులు లేని సమస్యలు వుండవు!' అన్నాడు మాధవ.

'బాగుంది!' అన్నాడు అదంతా శ్రద్ధగా విన్న కేశవ!

'కానయితే ఈ సమస్యలన్నీ కూలంకషంగా చర్చించే వ్యాసాలసంపుటే అన్నమాట నేటి నవలలు! సాంఘికాలూ అంటూ వస్తున్న నేటి నవలల్లో, సంఘపు కట్టుబాట్లు కాని, వాటిల్లోని లోపాలని సరిదిద్దాల్సిన అవసరాలని కాని, వ్రాయటం లేదు రచయితలు! ఒక చిన్న సంసారం గురించి, వ్రాసుకుపోయే [illegible] కథలో నవలలకుండాల్సిన లక్షణాలే [illegible]! ఇవి సంసార చిత్రణాలు కాని నవలలు అవుతాయా? మనకి చెప్పకోదగ్గ నవలలు, ఏవో వాలుగయిదుతప్ప ఇంకేమివున్నాయి! మానజాతిని మన నీతిని ప్రపంచ వ్యాప్తంగా చేయగలిగిన పాత్ర చిత్రణ ఒక్కనవలలో వుంటోందా? ఏదో వ్రాసుకపోతారు! ఏదో చదువుకుపోతారు! ఇల్లా వ్రాసుకుపోవటం కూడా ఒక విధంగా చూస్తే కాలం జరుగుబాటుకే వ్రాస్తున్నారేమో అనిపించకపోదు కదా!' అన్నాడు కేశవ!

'మీరు చెప్పినది ఆలోచిస్తే, నిజమే నన్పించుతోంది! నామటుకు నేనుకూడా నా పరిసరాల్లో జరిగిన సంఘటనలని ఏర్చి కూర్చుకుని, రూపు కట్టటానికే ప్రయత్నిస్తుంటాను. నా ఆలోచనా పరిధి అంతవరకే పరిమితమై వుండిపోయింది! ఆలోచనాశక్తి పెరగాలి! వ్యక్తి మనోవికాసం హెచ్చినకొలది, భావాలు కూడా పరిపూర్ణతని సాధిస్తాయి అనుకొంటున్నాము' అన్నాడు మాధవ.

'అది కొంతవరకు సహజచిత్రణే అవుతుంది. నీవు చూసిన ఒక సన్నివేశాన్ని నీవు పొందిన ఒక అనుభూతిని నీవు కథగానో, నవలికగానో మలచ కలిగేవంటే నువ్వు వాస్తవికతావాదానికి దగ్గరవాడవవుతావు! పూర్వ కావ్యాలలోలాగ స్త్రీ అవయవ, వర్ణనలూ పురుషుల విరహావర్ణనలూ, కోకిల కలకూజితలూ, మేఘరాజులూ, మెరుపు కన్నెలూ ఇవి మానసిక కవాటాలని ఎలా స్పృశించకలుగుతాయి? అవి ఎప్పటికీ ప్రకృతి సౌందర్యదృష్టిని అలవర్చుకుందామనుకునే రసికులకేగాని సామాన్యుల భావపరిధులకి అందుబాటులో వుండవు! మన ఊహలకందని, సౌందర్య లోకాల్లోని ఆనందపు టంచులకోసం కొరకరాని కొయ్యలాంటి వాక్యాల దిగ్బంధనాలని సడలించుకుంటూ కాలాన్ని వ్యయపరిచే బదులు మన కళ్లముందు జరిగే అకాల అనాచారములని మన మెదడు తేలిగ్గా స్వీకరించే పదాలతో చదువుకొని జీర్ణించుకుంటే చాలనుకుంటాడు నేటి వ్యక్తి! నిత్యం అనేక సమస్యలతో సతమతమయిపోతూ జీవితపు పరుగుపందెంలో ఓడిపోతూన్న నేటి మధ్యతరగతి వ్యక్తికి పూర్వ కాలం వాళ్లలా బొజ్జలనిండా బ్రేవుమంటూ త్రేనుపులు వచ్చేలా తిని తిరిగ్గా పచ్చ కర్పూరపు విడియాలు సేవిస్తూ నవరస



నా మంకు పట్టు నీదేగాని నా మాట వినవు గదా! – సరే! బోయస్ కాలేజీలోనే జేర్పిస్తాలే!

బాపు

ఖండాలనే తగ్గ పద్యపాదాలు విరిచివిరిచి చదువుకొని అర్థాలకి మళ్లీ టీకా తాత్పర్యాలు చదువుకోగల తీరిక వుందా?

అందుకని నేటి నవలల్లో సాంఘిక సమస్యలుకంటే కూడ ఎక్కువగా సంసారిక సమస్యలే ప్రాధాన్యత వహిస్తున్నయి అనుకోవచ్చును. ఇది కూడా ఒక రకమైన పురోగతే! ప్రజలూ, సాహిత్యమూ, సన్నిహితము కావటము పురోగతి కాదా!' అన్నాడు కేశవ.

వీళ్ళ సమకాలీన సాహిత్య సృష్టి గురించి చర్చించుకుంటూంటే కామేశ్వరి లోపల సీతమ్మగారివద్దకువెళ్లికూర్చుంది.

'నళిని ఏం చేస్తోందమ్మాయ్!' అంది సీతమ్మ.

'ఎవరో వచ్చారు మాట్లాడుతోంది!' అంది కామేశ్వరి.

'చూడు! పెద్దదాన్ని ఒకమాట అంటాను. మనసు కష్టపెట్టుకోకు! నీకు పెళ్లయిందికదా! ఇంక నీకు కాలేజీ చదువులు అనవసరం. పెళ్లి కాకపోతే ఎల్లాగూ పెళ్లయేదాకా ఇంట్లో కూర్చుండి ఏంచేస్తారు ఆడపిల్లలు అని కాలక్షేపంకోసం చదువుకోక తప్పదు! ప్రొద్దున్నగా కాలేజీకి వెళ్లి సాయంకాలం దాకా మీ రిద్దరూ ఇంటికి రాకుండా వుంటే ఈ కోటలాంటి ఇంట్లో నేను ఒక్కర్తినే పడివుండాలి! నళిని చిన్నపిల్ల, పైగా పెళ్లికాని పిల్లది! అది చదువుకుంటుంటే ఫరవాలేదు. ఏదో పెళ్లి కుదిరేదాకా చదువుకుంటుంది. దానితో నీకు వంతా! విక్షేపంలాంటి పిల్లవి! హాయిగా చీకూ చింతా లేకుండా సంసారం చేసుకోవాల్సినదానివి! చదువులూ అంటూ ఆడా మగా చేయీ చేయీ రాసుకు తిరుగుతూ కాలేజీలమ్మట తిరిగి నలుగురిచేత నాలుగుమాటలూ అనిపించుకోవాల్సిన ఖర్మ ఏం వచ్చింది? నాలుగు మాటలూ వింటే ఏమో బ్రహ్మకైనా పుట్టురిమ్మ తెగులు అన్నట్లు కేశవకి కూడా ఏమన్నా అనుమానాలు పుట్టేయంటే సంసారం అల్లకల్లోలం అయిపోతుంది. అంతా విచ్ఛిన్నం అయ్యేక నీకు దారీ తెన్నూ ఏమివుంటుంది? ఏదో పెద్దదాన్ని! మీరు కలకాలం సుఖంగా వుండాలని అన్పించి చెప్పాను. కోపం పెట్టుకోకు!' అంది సీతమ్మ.

కామేశ్వరి శుష్కహాసం వేసింది.

'కోపం ఎందుకు? మీరు ఆలోచించి చెప్పారు' అంది.

సీతమ్మ ప్రేమగా నవ్వి అంది.

నాకు తెలుసు! నీవు వివేకవంత

కాలివి!' అంది. కామేశ్వరి మాట్లాడ లేదు. భర్త అనుమతి ఇస్తేనే తను చదువుకుంటున్నది. పోనీ బి. ఎ. వరకూ చదువుకుందామనుకున్నది. నళినికి కూడా తను కాలేజీలో చేరటం ఇష్టంలేదు. అంచేతనే కాలేజీలో తనతో అంటీ ముట్టనట్లు ప్రవర్తిస్తుంది. ఇప్పుడు తనకి చదువు అంత ముఖ్యం కానేకాదు. ఎల్లాగో మూడుముళ్ళూ పడ్డాయి! ఆ బాంధవ్యాన్ని పవిత్రంగా భావించుతూ బ్రతికున్న నాలుగురోజులూ నిలుపుకోగల గాలి! చదువుకుంటే తనకి వచ్చేలాభం ఏమిటి? ఉద్యోగార్హత వస్తుంది! ఉద్యోగార్హత కలిగిన స్త్రీలు ఆర్థికంగా తమ ఇష్టానిష్టాలని జరుపుకోగల సమర్థులై వుంటారు. ఇప్పుడు తనకి జరుగుబాటు లేకుండా వుండలేదు కదా!' అనుకొంది కామేశ్వరి.

పెళ్ళికాని రోజుల్లో కామేశ్వరికి ఎన్నెన్నో కోరికలు గుండెల్లో గూళ్ళుకట్టి కాపురంచేసేవి! తనలో అంతర్గతంగా ఎంతో ప్రతిభ వుందనీ అది ఉజ్జ్వలమైన రూపు ధరించటానికి తన తల్లిదండ్రులు తగిన దోహదం చేయటంలేదని పైగా తనని సామాన్య బాలికలా పరిగణించి మూడుముళ్ళ వలలో బందీని చేయాలనే ప్రయత్నం చేస్తున్నారనీ విసుక్కునేది!

## మూడుముళ్ళూ

చూపులకు వచ్చిన ప్రతి పెళ్ళికొడుకు తన్ని తిరస్కరించి వెళ్ళిపోవటంతో ఆమెలో ఒకవిధమైన ద్వేషభావము రగుల్కొనేది! తను బాగాచదువుకోవాలనీ సంఘసేవికయ్యి స్త్రీ జనభవిష్యత్తుకు కాంతి కిరణంగా వుండే బాటలు ఏర్పరచాలనీ తన పేరు దేశదేశాలా మారు మ్రోగుతూండి పోవాలనీ అప్పుడు తన్ని పరిణయమాడ తిరస్కరించిన పెళ్ళికొడుకు లందరూ—

'తాము తిరస్కరించిన కన్య ఎంత విజ్ఞాన ఖనియైనదో!' తెలుసుకుని విస్తుపోవాలనీ కలలు కనేది! పెళ్ళికాని పిల్లలు కీర్తిని వరిస్తారు! మరిగృహస్థ జీవనులైన తర్వాత ఆ పిల్లలే సంసారపు సుఖశాంతిని అన్వేషిస్తారు.

'రేపట్నుంచీ కాలేజీకి పోనులెండి అత్తా!' అంది కామేశ్వరి.

'నాకు తెలుసు! నీ అణకువా మంచితనం! వసు నాకు తగ్గ కోడల్ను వెదకింది! నీ కడుపున నాలుగు కాయలు కాస్తే చూస్తాను. అంతకన్న ఈ పెద్ద వయసులో నాకేం కావాలి అమ్మాయ్!' అంది సంబరంగా సీతమ్మ.

* * *

జగదాంబా వాళ్ళ సంసారం బాగానే జరిగిపోతూంది. దసరా, దీపావళీ, సంక్రాంతి పండుగలు వొచ్చాయి. వెళ్ళాయి. పండుగలకి కూతుర్ని, అల్లుణ్ణి పిలవాలనీ అనుకుంది. కానీ, నరసయ్య వొప్పుకోలేదు.

'వాళ్ళ అంతస్తు ఎక్కడ? మన అంతస్తు ఎక్కడ? అంతటి ఆయన్ని ఎల్లా పిలుస్తాం? పిలిచి మనం ఎల్లా సత్కరిస్తాం?' అన్నాడు. అంచేత ఆ ప్రసక్తి ఎత్తటం మానుకోవలసి వచ్చింది. పోనీ కామేశ్వరి నెలా గిలా తప్పినట్లు వార్తలు వస్తాయేమో అని ఎదురుచూసేది కానీ, అల్లాంటి వార్తలు కూడా సంవత్సరం గిర్రుమని తిరుగుతోన్న నరసమ్మకి అందటంలేదు! జగదాంబకి కూతురిమీద జాలి వేసింది. 'వెర్రి మొహం! ఏం తిప్పలు పడుతూందో! ఏదో భాగ్యవంతుల ఇంట్లో పడిందికదా అని వూరుకుంటున్నాం! ఏంచేస్తుందో!' అనుకునేది. సుభద్రకి కూడా అక్కగారి సంసారం ఎల్లా వుందో చూడాలని బుద్ధి పుట్టేది.

'అమ్మా! అక్కని రమ్మని ఉత్తరం వ్రాయవే! నాకు చూడాలని వుంది. లేకపోతే నన్ను పంపియ్యి! నేను అక్కదగ్గిరికి వెళ్తాను' అని సాధించటం మొదలెట్టేది.

'పెళ్ళికాని పిల్లవి! అల్లా బంధువుల ఇంటికి వెళ్ళటం బాగుండదు! నేనే అక్కని పిలిపిస్తాను సంవత్సరమయి పోతోంది పెళ్ళయి వెళ్ళి! పిలిచి నాలుగు చీరలన్నా పెట్టి పంపకపోతే తప్పుకదా! మనకే మంచిది! ఆడపిల్లకి పసుపు కుంకుమా క్రింద మనకి తోచినదిఇస్తే!' అంది జగదాంబ!

కామేశ్వరి పుట్టింటి పిలుపు గురించి సీతమ్మతో చెప్పింది.

'అయ్యో! పెళ్ళయిన ఏడాదికి తనకో కూతురున్నట్లు గుర్తు వచ్చింది కాబోలు మీవాళ్ళకి! పండగలరోజులు వెళ్ళిపోయేక పిల్చారేం? ఏమీ పెట్టక్కర్లేదనా!' అంది. కామేశ్వరి ఏమీ బదులు చెప్పలేదు. ఆమె వాలకంచూసి సీతమ్మ అంది.

'మీ ఆయన్ని అడుగు తల్లీ! వాడికే ఇష్టం అంతా. వాడేం లేదు!' అంటూ సీతమ్మ సాగదీసింది. (ఇంకా ఉంది)



# మంత్రించిన ధాన్యం




ఒకప్పుడు కోటలోని ఖజానాలో కొంత ధనం దొంగిలించబడింది. ఖజానాలో మొత్తం యిరవై మంది పని చేస్తున్నారు. వారిలో యెవరో ఒకరు మాత్రమే యీ దొంగతనాన్ని చేసి ఉండాలి గాని యితరులకు అవకాశం లేదు.

ఎన్ని విధాలుగా ప్రయత్నించినా ఆ దొంగతనం యెవరు చేసినదీ తెలియ లేదు. దొంగను పట్టుకొనవలసినదిగా రాజు అప్పుడు మల్లన్న మంత్రిని కోరాడు. ఖజానాలో పని చేస్తున్న యిరవై మంది ఉద్యోగులను ఒక చోటకు రప్పించాడు మల్లన్న మంత్రి. ఒక గిన్నెలో పోసి ఉంచిన ధాన్యాన్ని వారికి చూపిస్తూ, మల్లన్న మంత్రి యిలాగ అన్నాడు:

'ఇక్కడ మేము యెన్ని విధాలుగా ప్రయత్నించినా, దొంగ దొరకలేదు. అందుచేత యీ విషయాన్ని మా గురువుగారికి కబురు పంపించాను. వారు యీ మంత్రించిన ధాన్యాన్ని పంపించారు. మీరందరూ, ఒక్కొక్కరు పిడికెడు ధాన్యం నోట్లో వేసికొని అయిదు నిమిషాలసేపు ఉంచాలి. తరువాత నిజం చెప్పకపోతే రెండు రోజుల్లోగా, దొంగతనం చేసిన వ్యక్తి చనిపోతాడు.'

వెంటనే రాజభటులు ఆ యిరవై మంది ఉద్యోగుల నోళ్ళలోను ధాన్యం పోశారు. అయిదు నిమిషాలు అయిన తరువాత ఉద్యోగులు ఒక్కొక్కరూ మల్లన్నమంత్రి దగ్గరకువచ్చి ధాన్యాన్ని కక్కివేశారు.

అప్పుడు మల్లన్న మంత్రి ఒక ఉద్యోగిని కోటలోనికి తీసికొని వెళ్ళి బెదిరించగా, తానే దొంగతనం చేశానని అతడు అంగీకరించాడు. రాజు ఆ ఉద్యోగివద్దనుంచి ధనాన్ని స్వాధీనం చేసికొని అతన్ని తగినట్లుగా దండించాడు.

'దొంగను యెలాగ కనుక్కొన్నా'రని రాజు మల్లన్నమంత్రిని రహస్యంగా ప్రశ్నించాడు. మల్లన్న మంత్రి దానికి యిలాగ సమాధానం ఇచ్చాడు.

'ప్రభూ! అవి మామూలు ధాన్యమే. అందులో మంత్రం యేమీ లేదు. దొంగతనం చేయనివారి నోటిలోని ధాన్యం తడిగా ఉంది. నా మాటలు వినగానే దొంగతనం చేసినవానికి నాలుక ఆరిపోయింది. నోట్లో తడి లేదు. అందుచేత ఆ ధాన్యం పొడిగానే ఉండిపోయింది. ఆ విధంగా నేను దొంగను కనుక్కొన్నాను.'

ఆ సమాధానం విని రాజు మల్లన్న మంత్రి యుక్తిని యెంతగానో మెచ్చుకొన్నాడు. ●






ఆదిరాజ సీతారాఘవకుమారి

'అమ్మా..! మాదాకవళం తల్లీ!' బయటినుంచి ఆర్తనాదం వినిపించింది.

'లేదుఫో!... వేళాపాళా ఏమీలేదా?...' లోపల్నుంచి కమలమ్మ అరుపు.

'అమ్మా! ప్రొద్దుట్నుంచి తిండి లేదమ్మా, ముసలాడికి ఒక్క ముద్దేసి పుణ్యం కట్టుకోండమ్మా!' దీనంతోపాటు మొండిగా అన్నాడు.

'ఏమండోయ్! చూడండి యీ మొండి వెధవ!... వెళ్లమంటే వెళ్లక పైగా ఎదురు చెబుతున్నాడు.' కమలమ్మ భర్త సహాయాన్ని కోరింది.

లోపలిగదిలో పేపరు చూస్తున్న సూర్యనారాయణమూర్తి కల్పించుకొని 'ముందు బయటికి పోతావా? పోలీసుల్ని పిలవమన్నావా? బిచ్చగాళ్లకు చోటివ్వగూడదు తెలిసిందా?' అంటూ దబాయించాడు.

'నాబోటి బలహీనుడి మీదనా మీ శాసనాలు అమలులో ఉంచేది!' అన్న చూపుతో యిక తప్పదన్నట్లుగా అవతలింటికి పోయాడా దౌర్భాగ్యుడు.

లోపలి కొస్తున్న సూర్యనారాయణమూర్తి 'ధర్మం వెయ్యాలట. ధర్మం! అసలే బియ్యం దొరక్క చస్తున్న యీ రోజుల్లో...'

'అన్నట్టు బియ్యం అంటె గుర్తుకు వచ్చింది. బియ్యం అయిపోయాయండోయ్! యిందాకనే ప్యూను ఎవరివో రెండు కూపన్లు పట్టుకవచ్చి యిచ్చాడు. డబ్బులివ్వండి తెప్పిస్తాను.

'కాస్తాగు! మనగుమాస్తాను యిందాకనే ఒకచోటికిపోయి డబ్బు తెమ్మన్నాను. ఈపాటికి తెస్తుంటాడు...' అంటూ ఆ పేపరును అక్కడ విసురుగా పడేసి. ఆఫీసు బాపతు ఫైళ్లు తీశాడు.

సూర్యనారాయణమూర్తి ఒకపేరొందిన ఆఫీసులో మేనేజరు. ఆరోజే కార్యార్థిగా వచ్చిన ఒకతను యిస్తానన్న పైకం తాను తీసికోవడానికి, ఆతనికా పనిచేసి పెట్టేందుకుగాను మధ్యవర్తిగా తన గుమాస్తా శంకరం నియమించబడడంతో యీ ఆయన కొస్త గాభరా పడుతున్నాడనే చెప్పవచ్చు. అందునా ఆ సమయంలో అనుకోకుండా చాలామంది చుట్టాలొచ్చారు. అందుకే ఆబాపతు ఫైళ్లు రిఫర్ చేయసాగాడు. మాటిమాటికి శంకరం వస్తున్నాడేమోనని వీధివంక చూడడం, తిరిగి యివతలకు రావడం చేస్తున్నాడు.

'సార్!...' శంకరం గొంతు వినగానే సూర్యనారాయణ మూర్తి, ఆఫైలును దూరంగా పడేసి ఆత్రుతగా, డబ్బు చేతికి అందిందిలే అన్న ధీమాతో యివతలకు వచ్చారు.

'సార్! జరగరానిదే జరిగింది సార్! ఆ పోయినవాడు పోయినట్టే పోయాడు! పైగా మీ మీద పై ఆఫీసర్లందరకూ సాక్ష్యాలతోసహా రిపోర్టు యిచ్చాడు సార్! అప్పుడు వచ్చిన వాళ్లందర్నీ ఆయనే తెచ్చుంటాడండీ' శంకరం భయం భయంగా చెప్పాడు.

'ఆఁ! అంతపని చేశాడా...' మూర్తి కంగారుగా కుర్చీలో చతికిలబడ్డాడు.

ఆరోజు మధ్యాహ్నం రెండుగంటలకు శర్మ ఆఫీసుకు వచ్చాడు. అతనికి ఏదో బాపతు 'ఎరియర్స్' దాదాపు నాలుగైదు వేలదాకా రావలసియున్నవి. అవి త్వరలో వచ్చేఏర్పాటుచేస్తే తనకు ఐదు వచ్చనోట్లు యిస్తానంటుండగా... లోపలకు క్లర్కు శంకరం యింకా మరెవరో యిద్దరు లోపలకు వచ్చారు, ఐనా చేతిదాకా వచ్చిన డబ్బును జారవిడుపడం యిష్టంలేని తను వాళ్ల యెదురుగుండా ఒప్పేసుకున్నాడు. తీరా యిప్పుడు శర్మ విశ్వాసం లేకుండా పై అధికారు లందరికీ రిపోర్టు చేశాడు.

యిహ యిప్పుడు ఏం జరగబోతోందో...? లేచి బట ్టలు వేసుకుని బజారుకు బయలుదేరాడు.

తన ఆఫీసు యు. డి. సి. విశ్వం యింటికి వెళ్లాడు. తనను చూస్తూనే లేచి నిలబడి—

'రండిసార్! రండి—ఏవిటిలా వచ్చారు. కబురంపితే నేనే వచ్చేవాడిని కదాసార్!...' భయపడుతూ అన్నాడు విశ్వం.

సూర్యనారాయణ మూర్తినవ్వుకున్నాడు. ఆఫీసులో తననుచూస్తే భయపడినట్లే యింటిదగ్గరకూడా భయపడుతున్నాడు. తను 'రిటైర్,' అయిన తరువాత ఆఫీసుకువస్తే కనీసం కూర్చోవడానికి కుర్చీఅయినా చూపుతాడో లేదో!

'ఆఁ! ఏవిలాలేదోయ్! ఏమీ తోచక యిలా వచ్చాను.' తడబడుతూ జవాబిచ్చి, తనకు చూపించిన కుర్చీలో కూర్చున్నాడు.

లోపల్నుంచి 'ఏమండోయ్! మొన్న మీరు తీసుకున్నబియ్యం అయిపోయాయ్! యీ రోజుకులేవు' అంటూ గుమ్మందాకా వచ్చిన శ్రీమతివిశ్వం మూర్తినిచూచి లోపలకు పోయింది.

విశ్వం మెల్లిగా అందుకొన్నాడు 'బియ్యానికి చాలా యిబ్బంది వచ్చిపడిందండీ! మొన్న ఆ నర్సింహ్మాయ్య దగ్గర బ్లాకుగా కొద్ది మొత్తం తీసికొన్నాను. యీ బ్లాకు వాళ్లంతా దేశంకోసం తమ దగ్గరున్న స్టాకునంతా ప్రభుత్వానికి అమ్మివేస్తే మనకు యీ దరిద్రం ఉండదు సార్! ఏమంటారు?' విశ్వం ఆగకుండా చెప్పుకుపోతున్నాడు.

తను బియ్యం అడుగుతానేమో నని ముందుగనే యీ తెక్చరుగొట్టి, తన కాళ్లకు బంధాలు వేస్తున్నాడు. అయినా యితన్ననుకుని పనేముంది. రోజులిలా వచ్చాయి అనుకున్నాడు మూర్తి.

'అన్నట్టు సార్! మొన్న నేనొక టి. ఏ. బిల్లు చేశాను. మీరు ఫార్వర్డు చేస్తారా అంటే'... ఏవేవిటో చెప్పుకు పోతున్నాడు.

'అసలు ఈ వెధవ ఉద్యోగాలను పట్టుకుని పాకులాడే కంటే శుభ్రంగా ఏ బిజినెస్సో చేసుకుంటే అంత ఉత్తమం మరొకటి లేదు...అదేమిటండీ అలా ఉన్నారు ఒంట్లో బాగో లేదా...?'

'అమ్మయ్య యిప్పటికి యీ లోకానికి వచ్చాడురా నాయనా' అనుకొన్నాడు మూర్తి మెల్లగా గొంతు సవరించుకొని.' 'విశ్వం! మధ్యాహ్నం ఎవరికో 'లోను' యివ్వాలని ఒక వెయ్యిరూపాయిలు క్యాషు తీసికొన్నావు కదూ! ఒక వారంరోజుల్లో తిరిగి 'అడ్జష్టు' చేస్తాను. అర్జంటుగా అయిదొందల రూపాయిలు అవుసరం గలిగింది ...లేకపోతే అడగనుగాని...' తడుముకుంటూ అన్నాడు సూర్యనారాయణ మూర్తి.

'మీ రడిగితే కాదంటానా కాని... రైతులకు పొలాలుపెట్టుబడికి, మందులు విత్తనాలు వగైరాలకు కావాలిటండీ...' నసుగుతూనే లోపలికిపోయి అయిదొందల రూపాయిలు రొక్కము తెచ్చియిచ్చాడు విశ్వం.

'వస్తానోయ్!' అంటూ యివతలకు వచ్చాడు సూర్యనారాయణమూర్తి.

యిప్పుడు యితనిదగ్గర అప్పు తీసికొన్నాను అంటే, అతని ఎన్నిపనులకు తాను అడ్డుపడ పోవలసిఉంటుందో...

తను చేస్తున్న యీ పనిమీద చాలా అసహ్యం వేసింది. దానితోపాటు కించిత్ పశ్చాత్తాపం కూడ కలుగక మానలేదు. కాని చేతులు కాలిన తరువాత ఆకులు చూస్తే ఏం లాభం? ఒకసారి నైతికంగా ఒక మెట్టు క్రిందకు వచ్చినవ్యక్తి, తిరిగి పశ్చాత్తాపంతో పై సోపానంకు పోదామనుకున్నా కాళ్లు పోనియ్యవు. క్రిందికే గుంజుతుంటవి. ఈ శక్తిని నిరోధించ గలిగింది ఒక్క మనోనిగ్రహం మాత్రమే. అది మొదలే కోల్పోతే, యిక ఉచ్ఛస్థితికి రావటం ఎన్నటికైనా అసంభవమే.

మూర్తి ఆలోచించుకుంటూ తమ ఆఫీసరు శ్రీనివాసరావు యింటికి వచ్చాడు. ఆయన కుటుంబము ఊరులో లేదు, కాబోలు ననుకుంటూ, గేటుదగ్గిర నున్న ప్యూనుతో—

'అయ్యగారు ఏం చేస్తున్నారు, శంకరయ్యా?' అన్నాడు.

'ఇప్పుడే హోటలునుంచి క్యారేజీ తెచ్చాను సార్! భోజనానికి కూర్చున్నారో లేదో తెలియదయ్యా!' వినయంగా సమాధానం చెప్పాడు.

'సరే' ననుకుంటూ లోపలికిపోయాడు. ఆయన అప్పుడే ఆ క్యారేజీని తెరుస్తున్నారు. తనను చూచి, 'రండి' అంటూ కుర్చీ చూపించారు.

'ఛీ, ఛీ! రూపాయిన్నర తీసుకుంటున్నా గాని, ఒక్క కూర అయినా సరిగాలేదు... పాడు హోటలు, పాడు వ్యవహారమూను' తన ఎదురుగా మరో వ్యక్తి ఉన్నాడన్న విషయమే మర్చిపోయినట్లుగా మాట్లాడుతున్నాడు.

సూర్యనారాయణ మూర్తి కలుగజేసుకొని—'ఆ క్యారేజీ అలా ఒదిలిపెట్టండి సార్! ఈ పూటకు మా యింటికి దయచేయండి, మీరేమీ అనుకోకపోతే...' అన్నాడు.

'అబ్బే! అవుసరములేదు లేవయ్యా! యిక రెండురోజులు పోతే ఫామిలీని తీసికొస్తాను. అందాకనే యీ బాధం తానూ...'

'అందుకనే యీ రెండురోజులూ మా యింటికి రండి సార్! యిక మీకంటే తక్కువ హోదాలో ఉన్నాను కాబట్టి మానేస్తేమాత్రం...బలవంతపరచను.'

'చాల్లేవయ్యా ప్రతిదానికి అర్థాలు తీస్తావు.' ఇక రాక తప్పింది కాదు.

ఇద్దరూ కలిసి దిన్నగా సూర్యనారాయణమూర్తి యిల్లు చేరుకున్నారు.

శ్రీనివాసరావు కూర్చోవడానికి కుర్చీ చూపించి, లోపలకుపోయి 'కమలా! అనుకున్న డబ్బు చేతికి రాలేదు. ఈరోజు కెలాగో గడుపు రేపు ఉదయం ఎక్కడనైనా అప్పో, సప్పో తీసికొంటాను. యిప్పుడు ఆఫీసరుగార్ని కూడా తీసుక

# అధికారి

చ్చాను. కావ్తే పక్కింటి వారింట్లో బదులైనా తీసికొని తయారు చేయి.' బ్రతిమాలుతున్న ధోరణిలో మూర్తి అన్నాడు.

ఒక్క నిమిషం స్తబ్ధురాలైంది కమలమ్మ. వెంటనే తేరుకొంది. ఈ పూటకు తమకు మాత్రమే బియ్యమున్నాయి. దానికి తోడు యింకాయనకు ఎలాగ? ప్రక్కవారింటికి ఆదరాబాదరా వెళ్ళింది.

'ఏమండీ పిన్నిగారూ! ఈ రోజుకు మాత్రమే బియ్యం ఉన్నాయి. మావారేమో ఆఫీసరుగార్ని పిల్చుకవచ్చారు. రేపు తేగానే తిరిగి యిచ్చేస్తాను రెండుసేర్లు మాత్రం యివ్వండి. మాట దక్కించండి.' ప్రాధేయ పడుతున్నట్లుగా అడిగింది.

'అవుసరమయితే పదిరూపాయలైనా యివ్వవచ్చుగానీ, బియ్యం బదులు యిచ్చే రోజులుటమ్మా యివి. అయినా అడగటానికి ఉండాలిగాని, ఏమని ఏంలాభం?' అంటూ ఒక్క సేరుమాత్రం తెచ్చియిచ్చింది.

'మాకూ రేపటికే వున్నాయి. తేగానే యివ్వటం మర్చిపోమాకు—'

కమలమ్మకు కళ్ళల్లో నీళ్ళుతిరిగాయి. ఈ తనచేతుల్తో ఎంతమందికి యిచ్చిందో! కాని...ఒక్క రెండు గంటల క్రితం... క్షుద్బాధతో అలమటించే ఒక పేదవానికి పిడికెడన్నంపెట్టి అతనిపేద తీర్చలేకపోయింది.

ఇప్పుడు...ఒక అధికారికి.. పదిమందిని పోషించగల అధికారికి...తమకులేకపోయినా నానామాటలుపడి బదులుతీసికొని ఆయన కడుపునింపుతున్నాము. ఆకలి తీరుస్తున్నాము.

ఆఫీసరువలెనే బిచ్చగానికిమాత్రం ఆకలిలేదా ?

లేకేం. ఆకలి ఉన్నది. కాని.. బిచ్చగానికి హోదామాత్రం లేదు. అంతేగా !

'భగవాన్ ! ఎన్నిపరిణామాలను తీసికొని వచ్చావు ? యింకా ఎన్నిమార్పులను తీసికొని రానున్నావో కదా!' కమలమ్మ హృదయం మృదువుగా స్పందించింది.

'స్టౌ' వెలిగించి అరగంటలో వంట తయారుచేసింది. ఈలోగా తన భర్త ఆయన్ను అదేపనిగా పొగడుతున్నాడు...పాడు 'ప్రపంచం'!

సూర్యనారాయణమూర్తి లోపలకు రాగానే 'వంట అయింది. ఆయన్ని లెమ్మనండి' అంది.

వెంటనే మూర్తి 'లేవండి సార్ ! కాళ్ళుకడుక్కొని రండి సార్!' అంటూ ఆయనకు నీళ్ళూ, తుండూ యిచ్చాడు.

వంటకాలను మెచ్చుకుంటూ సంతృప్తిగా భోంచేసి లేచాడు. వరండాలోకొచ్చి కూర్చున్నాడు.




మూర్తి జేబులోనుంచి ఐదొందల రూపాయలూతీసి ఆఫీసరుకిస్తూ 'ఇది మీ దగ్గర ఉంచండి సార్!' అన్నాడు.

'మరేం లేదుసార్ ! ఏదో బుద్ధిగడ్డితిని..యిందాక..శర్మ...తన 'ఎరియర్స్'కు వచ్చి...నాకు అయిదొందల రూపాయలు యిస్తానని ఆశజూపి, తీరా...సాక్ష్యాలతో సహా పై ఆఫీసరుకు రిపోర్టు చేశాడండి! అది తమద్వారావేగదా పోతుంది. ఈ ఒక్కసారికి మన్నించండి సార్ ! ఏదో పిల్లలు గలవాణ్ణి' మూర్తి కాళ్ళమీద పడినంత పనిచేశాడు.

'అయితే యిప్పుడు నువ్వేదైనా సాక్ష్యం చూపి నామీద అర్జీపెట్టవుకదా!' అనుమానంగా అన్నాడు.

'అయ్యో సార్ ! నా సంగతి తమకు తెలియదాండీ ! నేనంత విశ్వాసహీనుణ్ణనుకున్నారా?'

'అయితే ఫరవాలేదులే! అది 'ఫార్వర్డ్' అయినాగదా నీకు ముప్పు? అపిటీషన్ నాచెత్తబుట్టలోకే చేరుతుందిలే! యింతేగదా...వస్తానోయ్.' అంటూ లేచాడు...

'మనిషి తనతోటి మనిషిని నమ్మని రోజులు వచ్చిపడ్డవిగదా ! అనుకున్నాడు మూర్తి. ఆఫీసరును యింటిదాకా సాగనంపి వచ్చాడు...

* * *

రాత్రి పదకొండు గంటలయింది. కాని సూర్యనారాయణమూర్తికిమాత్రం నిద్ర రావడంలేదు. తన మనస్సు ఆలోచనల్తో సతమతమవుతున్నది.

మర్చిపోదామనుకున్నా మరపురాని సంఘటనలకు తన మెదడు పూర్తిగా చెదిరిపోయింది. ఆలోచనలు మళ్ళీ ఆరోజు సంఘటన మీదకు మళ్ళాయి. ఆఫీసరు చివరకు అన్నమాటలు చెవిలో గింగురుమంటున్నాయి. అవును! ప్రపంచం తీరే అట్లా తయారైంది.

తను శ్రీనివాసరావుకు అయిదువొందలు యివ్వటానికి ఎంత యిబ్బంది పడవలసి వచ్చింది, యిచ్చిన తరువాత గూడా ఎంత మధన పడుతున్నాడు.

అయితే తను యిప్పటికి వేలకి వేలు తిన్నాడే! ఆ యిచ్చేటప్పుడు యిచ్చేవాళ్ళెంత బాధకు గురి అయ్యారో! యిదంతా పాపమైతే కాదు గాని ఒక రకమైన పతన

మేగ! అసలు తను నైతికంగా పతనానికి రావడానికి కారణం...

వద్దనుకున్నా మెదడు గతానికే పోతుంది. తను స్కూలుఫైనలు ప్యాసు అయ్యేప్పటికి తమ ఆర్థిక పరిస్థితి పూర్తిగా దిగజారి పోయింది! పెళ్ళికి వచ్చిన అక్కయ్యలు, యింకా చిన్న చదువుల్లోనే ఉన్న తన తమ్ముళ్ళు...కుటుంబ నిర్వహణ...వీటన్నిటితో పాటు తనను కాలేజీకి పంపలేక పోయాడు తన తండ్రి. ఏదో ఒక ఆఫీసులో గుమాస్తాగా ప్రయత్నం చేయడం మొదలు పెట్టాడు.

అప్పుడు తను కోరుకునేవాడు, 'నీతి దాయకమైన ఉద్యోగం భవిష్యత్తు లభ్యమైతే బాగుండును...' అని. యింకా ఎప్ప

# అధికారి

టికే లంచాలు తీసికొన కూడదని...అసలు అవినీతికి అవకాశం ఉండే ఉద్యోగమే వేయగూడ దనీని...

కాని తన మేనమామ ఉద్యోగం కోసం ప్రయత్నిస్తూనే 'ఈ ఉద్యోగంలో చేరితే అసలు జీతంతోనే అవుసరముండదు.' అంటూ తనను ఈ ఆఫీసులో......నానా యాతనబడి ఉద్యోగం యిప్పించాడు.

ముందు తనకు యీ ఉద్యోగం యిష్టం లేదు. కాని తిన్నగా ఆలోచించగా యిదే నయమనిపించింది. ముందు ముందు రోజులు ఎట్లా గడువనున్నవో...! అసలు తన జీతం చాలక ఒకరి మీద ఆధారపడే సమయంలో...యీ ఉద్యోగంలో రాబడి లేదే!...అని విచారించే కన్నా, అవకాశం ఉన్న ఉద్యోగంలోనే ప్రవేశించి,... తనకు యిష్టంలేని పద్ధతిలో నిగ్రహం చూపితేనే సరిపోతుంది...అనుకుంటూ ఆ రోజు ఈ ఆఫీసులో ప్రవేశించి మెల్లిగా యీ నాటికి యీ మాత్రం హోదాకు వచ్చాడు.

అప్పటోల్ల చాలాకాలం వరకు మనో నిగ్రహంతో, నిజాయితీగానే నిర్వహించాడు. అంతా తనను అసమర్ధుడిగా పరిగణించారు. పై అధికారులు వత్తిడి చేశారు. కనీసం తన చెల్లెలును అత్తవారింటికి పంపేనాడు కూడా పరాయి సొమ్ము పైసా ముట్టలేదు.

కాని...ఒక రోజు...

తన చెల్లెలుకు నిండు నెలలు. యింటికి తీసికొని వచ్చాడు. ప్రసవ వేదనలు ఆరంభమైనాయి. ఆ రోజుకు దిన బత్తెములు లేవు. ఏదో పనికోసం, యీ శర్మే ఆ రోజు కూడా తన కోసం ఒకటికి పది సార్లు వచ్చాడు.

ఇంట్లో అంతా పస్తు.

చెల్లెలుకు ప్రసవ వేదనలు...

చేతిలో పైసా లేదు...

తప్పనిసరయింది. ఆ రోజు...మొదటి సారిగా..భగవత్సాన్నిధ్యంలో'..శర్మ దగ్గిర..యాభై రూపాయిలు...

మూర్తి కళ్లల్లో నుండి నీళ్లు కారుతున్న సంగతే మర్చిపోయాడు.

...అప్పటికి తన అవుసరం తీరింది. కాని అప్పటికి ఒక మెట్టు క్రిందకు ఒచ్చిన తను తిరిగి పైకి రావడానికి ప్రయత్నించాడు. కాని అవుసరాలు అవే కాళ్ళు రానీయలేదు.

ఈరోజు...తను ఒకవంద రూపాయిల కోసం ఏమైనా చేయగలడు.

మూర్తి తలను దిండులో దూర్చి ఏడువ సాగాడు: ఆగాలనిపించలేదు. బేల హృదయము పోయింది. కసిదీరా ఏడ్చాడు. తనను ఓదార్చే వారెవరు?...తన సొమ్మును అనుభవించిన వాళ్లెవరయినా ఓదారుస్తున్నారా? అందుకే ముందు ఎన్ని దృఢనిశ్చయాలు ఏర్పరచుకొన్నా, వాటికితోడు ఆధ్యాత్మిక చింతన ఎంతైనా అవుసరమనిపించింది.

పురాణ కాలాల్లో...మహర్షుల జ్ఞానోపదేశంవల్ల ఒక కిరాతకుడే మహర్షియై రామాయణాన్నే వ్రాయగలిగాడు...కాని తన ఆత్మయినా తనకు ఆవిధంగా ఉపదేశించగలదా? అయినా తను ఆచరించగలడా?

దిండు తన కన్నీటితో ముద్దయిపోయింది. అప్పటికి అతని ఆవేదనాభారం కొంతవరకు తీరినట్లయింది. తెలియకుండానే నిద్రపట్టేసింది.

'సార్...' అన్న కేకతో సూర్యనారాయణమూర్తి ఆలోచనలు విడి వడ్డాయి.

ఆఫీసు ప్యూను శంకరయ్య, 'సార్! మీకు యీ కాగితం యిచ్చిరమ్మని అయ్యగారు పంపారు సార్!' అంటూ ఓ కవరు తనకు యిచ్చిపోయాడు.

శలవుపెట్టినా ఆఫీసునుండి కవరువచ్చినందుకు ముందు చిరాకుపడ్డా యిదేదో 'అర్జంటు, అయివుండవచ్చు' ననుకుంటూ కవరువిప్పి చదవటం మొదలుపెట్టాడు.

'మీరు కార్యార్థులై వచ్చిన అర్థులవద్ద 'లంచాలు' తీసికొంటూ వారిని యిబ్బంది పెడుతున్నారని తగు సాక్ష్యాలతో నిరూపించబడిన 'అర్జీలు' మాకు అందినవి. యిందుకు మీ సంజాయిషీ వెంటనే కోరబడుచున్నది.

లేనియెడల...

ఇక ఆకాగితం చదవలేక పోయినాడు సూర్యనారాయణమూర్తి.

శ్రీనివాసరావు తనని మోసం చేశాడు. ఒకరినొకరు మోసం చేసుకుంటూనే ఉన్నాము. తనకు శ్రీ కృష్ణజన్మస్థానం తప్పదు. భగవంతుడు తగినశిక్షే విధిం

తాడు. తనకామాత్రం శాస్తి జరిగి తీరాల్సిందే! అసలు తన యీ శిక్షకు ముఖ్య కారకులెవరు?... పరిస్థితులా?...కాదు.. ఎంతమాత్రమూ కాదు..!

తన జీతం తనకు చాలనప్పుడు ప్రక్కదారిపడితే అది తన తప్పా? పెరిగిపోయే ధరలను ఎవరూ నిరోధించనందుకు వారికేవిధా నష్టములేదా? కేవలం తనే ఎందుకు అనుభవించాలి?

పది రూపాయిలు తన సంపాదన పెరిగితే అవుతల రెట్టింపు ధరలు పెరుగుతున్నాయే! దానికి తగినట్టు విపరీతంగా సంతానం పెరిగిపోతున్నదిగదా! ఒకేరకమయిన న్యాయం అందరికీ ఎందుకు వర్తించదు? ఎందుకీపక్షపాతవైఖరి?

దీనికి తరుణోపాయం...? శాంతిని కోరే మనస్సులకు యుద్ధము తప్పనిసరైతే, అప్పటి దేశపరిస్థితి...?

ఏమీలేదు! లేనికుటుంబం యింకా చితికి, చితికి పోతుందేమో! ఉన్నవాడు మరి కాస్త సంపాదిస్తాడు!! పెద్దమనిషిగా చెలామణి అవుతాడు!!! యిందులో...భగవంతుడు ఉన్నట్లయితే, ఆయన ప్రసక్తి లేకుండా యిన్ని ఘోరాలు జరుగలేవు కదా!

ఏమో! పెద్దలు చెప్పినవి మూఢవిశ్వాసమని త్రోసి పుచ్చడానికి వీలులేదు. ఎప్పటికయినా ఆ భగవానుడే ఏదైనా రూపంలో అవతరించి ఈ అన్యాయాలను అరికట్టగలడేమో?

కాని...ప్రస్తుతం తనస్థితి...?

బ్రతకడం అవసరం...తను ఒక్కడే చావకూడదు...అది పిరికితన మవుతుంది. శ్రీనివాసరావును, శర్మగాడిని నెత్తుటికంట చూసి, తరువాత తను...!

దొంగ పుట్టుకతోనే దొంగయి పుడతాడా! ఖూనీకోరు పుట్టే పుట్టడమే హత్యలతోనే పుట్టడుగదా!! కారణం; తన వలెనే పరిస్థితులు విపరీత మార్గాలకు దారి తీస్తాయి. అందుకు బాధ్యులెవరు? ఎవర్నని ఏం లాభం?

తలచుకొంటేనే భయమేస్తోందే?

'అమ్మో!' సూర్యనారాయణ మూర్తి అప్రయత్నంగానే, బిగ్గరగానే కేకవేశాడు.

'ఏమిటండీ అలా అరుస్తున్నారు? ఏమైనా పాడుకల వచ్చిందా?' కమలమ్మ ప్రశ్నించేసరికి, తను యిప్పుడనుభవించిన వరకమంతా కలలోనే అని గుర్తుకువచ్చింది.

# పాదాభివందనం * ధర్మపథం



బులుసు వేంకటరమణయ్య — వసు

ఉదయాన్నే లేచి పెద్దలకు పాదాభివందనం చెయ్యాలని మన పెద్దలు చెప్తూ వుంటారు అది ఎక్కువ వినయ విధేయతలనూ, భక్తి ప్రపత్తులనూ సూచిస్తుంది.

నమస్కారం అభిప్రాయం ఏమిటంటే—'నేను మీకంటె తక్కువవాడను; మీరు నాకంటె అన్నివిధాలా ఉత్కృష్టులు' అని వ్యక్తం చెయ్యడమే! నమశ్శబ్దానికి వంగి వుండడమని అర్థం; ప్రణామం అనేదీ ఈ అర్థాన్నే తెలుపుతుంది.

నమస్కారం సామాన్యంగా గౌరవ మర్యాదలను సూచిస్తుంది. పాదాభివందనం—అంటే సాష్టాంగ నమస్కారం విశేషమైనది!

పిన్నలు పెద్దలకు నమస్కారం చెయ్యడం భారతదేశ సంప్రదాయాలలో ప్రధానమై ఉన్నది. ఇప్పుడు సర్వసాధారణంగా వాడుకలో ఉన్న 'నమస్తే (నీకు నమస్కారం)' అనేమాట ఈ సంప్రదాయాన్ని సూచిస్తూ వుంటుంది.

పెద్దలకూ, వయోభేదాన్ని పాటించకుండా గురువులకూ, తల్లిదండ్రులకూ, తనకంటె పెద్దలైన సోదరీ సోదరులకూ నమస్కారం చెయ్యడం ధర్మమని పెద్దలంటారు. అన్నగారి భార్య వయస్సులో తనకంటె చిన్నదయినా, ఆమెకు నమస్కారం చెయ్యవలసి ఉంటుంది.

ఇలాంటి సంప్రదాయం దక్షిణ భారతంలోనూ—విశేషించి తెలుగుదేశంలోనూ క్షీణించిపోయినా ఉత్తర ప్రాంతాలలో మాత్రం అనుస్యూతంగా అమలులో ఉంటూ ఉన్నది, ఇతర స్థలాలనుంచి యింటికి వచ్చి తల్లిదండ్రులనూ, సోదరులనూ చూచినప్పుడు వారికి నమస్కారం చేసే పద్ధతి తెలుగువారిలో చాలా కొరవడింది.

తల్లిదండ్రులను గౌరవంగా పిలిచే అలవాటూ చాలామందికి లేదు. తండ్రిని 'ఏమిరా? ఏమయ్యా! నీవు' అని ఏకవచనంతో సంబోధించడం కొన్నిచోట్ల పరిపాటి అయిపోయింది. పెద్దలకూ, తల్లితో సమానమైన వదినెగార్లు మొదలైన వారికీ నమస్కరించడమూ, పాదాభివందనం చెయ్యడం ఎబ్బెట్టుగా కొందరికి తోస్తుంది. అలా నమస్కరించేవాళ్లని కొందరు స్త్రీ పురుషులు పిచ్చివాళ్లలో లెక్క కట్టడం జరగవచ్చు.

పాదాభివందనం ఉత్తమ సంప్రదాయం! ఔత్తరాహులు దీన్ని ఎంతో గౌరవంతో పాటిస్తారు!

రమారమి నలభై యేళ్లకిందటిమాటే కావచ్చు.

కాశీ విశ్వవిద్యాలయంలో వ్యాసంగం చేస్తున్నప్పుడు హాస్టలులో నేనున్న గదిలో 'హరదత్త పంత్' అనే అల్మోరా జిల్లా నివాసి—విద్యార్థి ఉండేవాడు, నాతోకూడా. (ఒక గదిలో ఇద్దరిద్దరు ఉండాలని నియమం!) ఆయన కొంత నియమపరుడు! స్నానం చేసిన తర్వాత, కొంతసేపు జపం చేసుకునేవాడు. ఒకనాడు అతను అలా జపం చేసుకుంటున్నప్పుడు ఒక వ్యక్తి తలపై టోపీతో, ఉన్ని దుస్తులతో—కాలి బూట్సుతో గదిలోకి వచ్చాడు. అతన్నిచూసి 'పంత్' కుర్చీలో కూర్చోమనీ సంజ్ఞ మాత్రం చేసి, తన జపం శీఘ్రంగా ముగించుకుని, తర్వాత ఆ నూతన వ్యక్తికి సాష్టాంగపడి, అతని కాలిజోడుపై ఉన్న దుమ్ముతీసి తన నొసట ధరించి, తర్వాత కుశల ప్రశ్నలు వేశాడు. దీనినంతటినీ గమనిస్తున్న నాకు ఆశ్చర్యం కలిగింది.

కొంతసేపు వారు ఇష్టాగోష్ఠిగా మాటలాడుకున్నారు. తర్వాత ఆ వ్యక్తి వెళ్లిపోయాడు.

తనవైపే చూస్తున్న నాతో హరదత్త పంతు 'ఆయన మా అన్నగారు! దేశాలు తిరుగుతూ ఉంటారు. ఇప్పుడు రావడం మీ ఆంధ్రదేశం నుంచే!' అన్నాడు.

'ఇంత నియమంతో జపం చేస్తున్న మీరు ఆయన బూట్సు ముట్టుకుని దుమ్ము నుదుట రాసుకున్నారే?' అని అడగదలచాను కాని, మాట నాలుకచివరదాకా వచ్చి నిలిచిపోయింది. ఏమంటే—ఆయన తొందరపాటు మనిషి! 'మీ దేశంలో పెద్దలకు నమస్కరించే అలవాటయినా లేదేమో?' అని అంటాడని నా భయం! భక్తి గౌరవాలముందు ఆచార నియమాలు తీసికట్టు! సంప్రదాయమే ముఖ్యం! ●



# జీవనరాగం

## ఉన్నవ విజయలక్ష్మి

### జరిగిన కథ

ఇద్దరు అన్నయ్యలకి, ఇద్దరు అక్కయ్యలకి ముద్దుల తమ్ముడు నిరంజనం. అతనికి భార్య పోవటంతో అత్తగారు సీతమ్మగారిదే యజమాయిషీ. వసంత నిరంజనం కూతురు. పెద్ద కొడుకు మధు. పట్టభద్రురాలయిన అమ్మాయి సుధతో అతనికి పెళ్ళవుతుంది. సీతమ్మగారి జ్వరం ఆమె ప్రాణాన్ని తీసుకుంది. పనంతా సుధ నెత్తిమీద పడుతుంది. ఆర్భాటాలమీద మోజుపడిన సుధ మధుని లెక్చరరు ఉద్యోగం విడిచిపెట్టి ఇతర ప్రయత్నాలు చెయ్యమంటుంది. ఆమె మాటల్ని మధు లెక్క చెయ్యలేదు. సుధ మామగార్ని సూటిపోటి మాటలనడం ప్రారంభిస్తుంది. నిరంజనం గతాన్ని నెమరువేసుకుంటూ ఆ ఆలోచనల్లో లీనమైపోతాడు. ఆ ఆలోచనల్లో సీతమ్మ తన జీవితంలో ప్రవేశించిన విధం కళ్ళముందు కదలాడుతుంది.

## 17

అయితే ఇప్పుడాలోచిస్తుంటే మరో సత్యం గోచరిస్తోంది—ఆ నేరాలకి శిక్షా స్మృతిలో తగిన దండన వున్నది—కాని, ఏ న్యాయస్థానం నేరంగా పరిగణించటానికి వీలులేకుండా, ఎవ్వరూ ఎలాంటి దోషమూ ఆపాదించటానికి ఆస్కారంలేకుండా అతి తెలివిగా ఎదుటిమనిషిని మానసికంగా చిత్రహింసకి గురిచెయ్యగల రాక్షసస్త్రీలుకూడ ఉన్నారు—రాక్షసులు. నిజమే—తన కూతురికి దక్కకుండా పోయిన సుఖం అల్లుడు కూడ అనుభవించకూడదు అనే ఓ చిత్రమైన, పైశాచిక ప్రవృత్తి ఇంత గాఢంగా నాటుకుపోయిన స్త్రీని అంతకన్న మరేమనాలో అతనికి తెలియటం లేదు—ఆనాడు ఏవేవో షరతులుపెట్టి చివరికి తనని మళ్ళీ వివాహానికి విముఖుడ్ని చెయ్యటానికి, ఈనాడు తను మరే విధంగానయినా సుఖపడిపోతున్నాడేమో అనే అనుమానంతో అసూయతో దహించుకుపోతూ, అది తేల్చుకోవటమే ముఖ్యమైనట్లు విచక్షణా జ్ఞానాన్నికూడ కోల్పోయి పసిపిల్లని ప్రోత్సహించటానికి ఆ ప్రవృత్తే కారణం—

ఆలోచనలతో కొట్టుకుపోతున్న నిరంజనం చటుక్కున గుర్తువచ్చినవాడిలా ఇంకా ఏదో అడగాలనుకున్నాడు. కాని అక్కడ వసంత లేదు. తండ్రి రూపం చూసి భయపడి ఆ పిల్ల ఎప్పుడో మెల్లిగా జారుకుంది.

భారంగా లేచివెళ్ళి మంచంమీద పడుకున్నాడు. తలక్రింద రెండు చేతులూ పెట్టుకుని వెల్లకిలా పడుకుని, ఎడతెగకుండా వస్తున్న ఆలోచనలలో కొట్టుకుపోతున్న నిరంజనానికి మొట్టమొదటిసారిగా తన అప్రయోజకత్వానికి తనకే సిగ్గువేసింది. తన పిరికితనానికి తననే నిందించుకున్నాడు—ఊహూ. ఇంక నా భయాలకి ఆలోచనలకీ స్వస్తిచెప్పాలి. నిర్భయంగా, ఈ ప్రపంచం అందించే అన్ని సుఖాలని అనుభవించాలి.

రేపు సాయంకాలం తిన్నగా కోర్టునుంచి క్లబ్బుకే వెళ్తాను—గోపాలం చెవిలో ఒక్కమాట వేశానంటే చాలు, వేనిన్నాళ్ళకయినా కళ్ళు తెరిచినందుకు అభినందిస్తూ రెండో కంటివాడికి తెలియకుండా సీసాలకి సీసాలు సప్లయిచెయ్యగలరు. అక్కడ పీకలదాకా తాగి రాత్రంతా ఎక్కడయినా గడిపి మరీ వస్తాను—అప్పుడు చూడాలి ఈ సీతమ్మగారి మొహం ఎలా వుంటుందో—లేకపోతే ఎంత మంచిగా వుంటున్నా నావిలువ ఈవిడకి తెలియటం లేదు—

ఛ! ఏమిటిది? ఆవిడమీద కోపంతో నన్ను నేను నాశనం చేసుకోనా, ఇన్నాళ్ళ నా నిగ్రహం మంచితనం ఒక్కరోజుతో సర్వనాశనం చేసుకోనా—

ఏమిటా మంచితనం? జీవితంలో ఏమీ అనుభవించకుండా, అత్తగారి అడుగులకి మడుగులొత్తుతూ చేతకానివాడిలా ఈ నాలుగు గోడలమధ్యా పడివుండటమే మంచితనమా—

కాను. మంచితనం ఒక్కటేకాదు నేను. నడుస్తున్నదీ ఆదర్శప్రాయమైన ధర్మమార్గం—

ఛీ. నా కసలు ధైర్యంలేదు నేను. అనుకున్నవాటిలో ఏఒక్కటీ చెయ్యలేను. ఆ పిరికితనానికే మంచితనం అని పేరు పెట్టుకొని పొంగిపోతున్నాను. ధర్మం నీతి అంటూ పారాలు వల్లెవేస్తున్నాను. నా పరిస్థితిలో వున్న మరొకరయితే దిక్కున్నచోట చెప్పుకోమని అత్తగారిని వెళ్ళగొట్టేవారు. ఎంతమంది మళ్ళీ పెళ్ళి చేసుకోటంలేదు, అందరు సవతిపిల్లల ప్రాణాలు తీస్తున్నారా? నా పిల్లలొక్కరికే అలాంటి దుర్గతి పడుతుందా—

అదంతా నిజమేకావచ్చు. జరిగిపోయిందాన్నిగురించి ఇప్పుడు అనుకుని లాభం లేదు — న్యాయంగా, ధర్మంగా దక్కవలసిన సుఖాన్ని ఒకనాడు వదులుకుని, ఇప్పుడు అధర్మమార్గంలో దాన్ని కొనుక్కునే నైచ్యం నాలో లేదు—పిరికివాడని, అప్రయోజకుడని అంతా అనుకున్నా నాకు చింత లేదు — నా క్కావలసింది అధర్మంతోవున్న సుఖం సంతోషం కాదు. ధర్మంతో వున్న శాంతి ఒక్కటే—

శగలు పొగలు కక్కిన నిరంజనం అంతరంగం క్రమంగా శాంతించిపోయింది.

రోజులు యథాప్రకారం గడిచిపోతున్నాయి.

సీతమ్మగారి మరణానంతరువాత ఇంట్లో ఏర్పడిన పరిస్థితులు అతను ఎంత గోప్యంగా వుంచాలనుకున్నా కొందరికి తెలిసేపోయాయి. ముఖ్యంగా గుమాస్తా శంకరయ్య ఎన్నిసార్లో ఆ గొడవలని తన చెవులతో విన్నాడు — అతను పేరుకి మాత్రం గుమాస్తా కాని నిరంజనానికి బాల్య స్నేహితుడు, అభిమానపాత్రుడు—ఆ చనువుతోటే ఓ సాయంకాలం ఇంట్లో

ఎవ్వరూ లేని సమయంలో మెల్లిగా వచ్చి నిరంజనం ప్రక్కన నిలబడ్డాడు.

'ఏం కావాలి?' అన్నాడు నిరంజనం అతనేదో చెప్పటానికి వచ్చాడని గ్రహించి.

'మీతో కొంచెం మాట్లాడాలి. కోర్టు విషయాలు కాదు — మీరు అనుమతిస్తే వ్యక్తిగత విషయాలే' అన్నా డతను అర్థిస్తున్నట్లు.

'కూర్చో' అంటూ ప్రక్కనే వున్న కుర్చీ చూపించాడు నిరంజనం. శంకరయ్యని చూస్తే అతనికి అభిమానంతో పాటు సానుభూతికూడావుంది.

ఆదాయం తక్కువ. సంసారం పెద్దది. అక్కడికీ అందరూ యిచ్చే దాని కన్నా ఎక్కువే యిస్తున్నాడు అతను. ఇంకా క్లయింట్లవల్ల యింతో అంతో ముడుతుంది. ఎంత వచ్చినా, వెనక ఏ ఆధారం లేకుండా కేవలం రెక్కల కష్టంతో పది మంది సంతానం గల కుటుంబాన్ని పోషించుకురావడం అన్నది తలకు మించిన బాధ్యతే అయింది. పిల్లల పెళ్ళిళ్ళు, చదువులు, కాన్పులవల్ల బలహీనమైపోయి ఎప్పుడూ ఏదో ఓ సుస్తీతో తీసుకునే భార్య ఆరోగ్యం, అన్నీ సమస్యలే అతనికి.

'కోట్లకొలది రూపాయలు వెచ్చించి, ప్రభుత్వం కుటుంబ నియంత్రణని గురించి ప్రచారం సాగిస్తూంటే ప్రజలకి తిండి పెట్టలేని అసమర్థ ప్రభుత్వం అంటూ అపహాస్యం చేసి, అదంతా కేవలం ఆ గ్రామసేవికల ఉద్యోగాలు నిలపటంకోసం ఉద్దేశించబడింది అన్నట్లు వాళ్ళని అవమానపరచి పంపిస్తారు — ప్రభుత్వం మాట ఎలా వున్నా అధిక సంతానం తల్లిదండ్రులకి ఎంత బరువు బాధ్యతలని సృష్టిస్తుందో అనుభవిస్తున్నవాళ్ళని చూసయినా మిగిలినవాళ్ళు జాగ్రత్తపడరు. స్వానుభవంలో తప్ప ఎవ్వరికీ ఏదీ వంటపట్టదు—' అని యెన్నోసార్లు చెప్పుకున్నాడతను. ఇప్పుడు యే కూతురికయినా పెళ్ళి సంబంధం కుదిరిందో, లేకపోతే తను అడిగింది ఇస్తేనే కాని అమ్మాయిని తీసుకువెళ్ళనని యే అల్లుడయినా అలిగి కూర్చున్నాడో ఏదో అవాంతరం వచ్చేవుంటుంది

శంకరయ్యకి చెప్పేది వినటానికి నిరంజనం సిద్ధంగానే వున్నాడు కాని శంకరయ్య మాత్రం కొద్ది క్షణాలు తటపటాయించి చివరికి మెల్లిగా అన్నాడు.

'చాలాకాలంనుండీ తీరకుండా మిగిలిపోయిన కోరికే — మీరు మా కింకో అమ్మగారిని తీసుకురావాలి.'

ఎదురుచూడని ప్రస్తావనతో తెల్లబోయిన నిరంజనం కనుబొమలుచిట్లించి 'నీకు మతిపోలేదుకదా' అన్నట్లు చూశాడు శంకరయ్యవైపు.



'మీరు మరోసారి ఆలోచించండి — అప్పుడు ఎంతమంది చెప్పినా పెడచెవిని పెట్టారు — ఇప్పుడు మీ పరిస్థితులు చూస్తుంటే నా గుండె చెరువయిపోతోంది— ఎవ్వరికీ యెలాటి అపకారమూ హానీ తలపెట్టని ధర్మరాజులాంటి మీకు ఇంట్లో ఎలాంటి ఆదరణ...'

'నువ్వేదో అపోహ పడుతున్నావు—నేను హాయిగా వున్నాను.' అర్థం కాబోతున్న గొంతుని అదుపులోకి తెచ్చుకున్నాడ నిరంజనం.

'కాదు బాబు నా మాట కాస్త వినండి —మీ కోడలి మీద చాడీలు చెప్తున్నాననుకోవద్దు—ఈ మాత్రం చెయ్యి కాలూ స్వాధీనంలో వుండి రెండుచేతులా సంపాదిస్తున్నప్పుడే మిమ్మల్ని లెక్కచెయ్యకుండా వున్నవాళ్ళు ఆ తరువాత మిమ్మల్ని ఎలా చూస్తారో గ్రహించుకోవచ్చు. లోకపుతీరే

అంత...'

'ఇంట్లో ఆదరణ మాట ఎలావున్నా ఊళ్లో వున్న గౌరవంకూడ పోగొట్టుకో మనేలా వున్నావు. చావుకి సిద్ధమయిన సుందరయ్య మూడోపెళ్లికి తయారయి నట్లు...'

'అతనికీ మీకూ పోలికేమిటి...'

'లేదు శంకరయ్యా, మాటవరసకి ఆ గౌరవ మర్యాదల సంగతి ఎత్తాను కాని మన్వు చెప్పింది నాకే సమ్మతంగా లేదు. ఇంకెప్పుడూ ఆ ప్రస్తావన తీసుకురాకు. కోడలికింకా చిన్నతనం, ఏమీ తెలియదు. కొన్నాళ్లు పోతే కష్టం, సుఖం, మంచీ మర్యాద అన్నీ తెలుసుకుంటుంది.' అంటూ ఆ సంభాషణ విముఖం చేశాడు. శలవు తీసుకుని నిరాశగా వెళ్లిపోయాడు శంకరయ్య.

మొదటినుంచీ నిరంజనం జీవితాన్ని చూసి జాలిపడినవారూ, అపహసించిన వారూ కొల్లలున్నారు. కాని ఏనాడూ ఎవ్వరూ అతని ప్రవర్తనని వేలెత్తి చూపించలేదు. ఎలాంటి అపవాదు అతనికి రాలేదు. నిశ్చింతగా ప్రశాంతంగ వున్న అతని అంతరంగం ఇప్పుడు కోడలి మాటలతో రంపపుకోతే అనుభవిస్తోంది— నిజంగా, నా చాటున అందరూ అలా అనుకుంటున్నారా? — ఒక్కనాడైనా అది నా చెవిన పడకుండా వుంటుందా. ఛ. అదెంతమాత్రం నిజం కాదు. అదంతా కాంతమ్మ కల్పనే! ఆ మనిషి ఎలాంటిదో

# జీవనరాగం

శంకరయ్య చెప్పవే చెప్పాడు. దానిని గురించి నేను బాధపడకూడదు. మన స్సుని కాస్త కుదుటబరుచుకునే లోపలే సుధ మాటల్లోని మరో అంశం గుర్తు వచ్చి అంకుశంతో వెన్నుమీద పొడిచినట్లే అయింది—తన ఉనికి ఆమెకి పెద్ద ప్రతి బంధకంగా వుంది—తనని విడిచి మధు ఎక్కడికీ వెళ్లడు. అందువల్ల అతని భవిష్యత్తు నాశనం అయిపోయింది అదే ఆమె బాధ—

తన కొడుకు దృష్టిలో తను చేసింది త్యాగం, కోడలి దృష్టిలో అది ఆమె పాలిటి శాపం—విషాదంతో కూడిన చిరునవ్వు అతని పెదవులమీద త్రుటికాలం మెరిసి మాయమయింది—

ఇవాళ ఇలా కూర్చుని గట్టిగా ఆలో చిస్తూంటే ఏ ధర్మానికి బద్ధుడై తను అంతిమ త్యాగం చేశాడో అర్థం కావటం లేదు—చనిపోయిన భార్యని మరిచిపోలేని అనురాగమా, పిల్లల్ని దూరం చేసుకోలేని మమకారమా, అత్తగారి మాటకి ఎదురు చెప్పలేని పిరికితనమా, వీటన్నింటిని మించి మీనాక్షి చివరి కోరికని నెరవేర్చా లనే ఆరాటమా?—ఏ అనుబంధానికి కట్టు బడి ఇన్ని సంవత్సరాలు తను ఈ విధుర జీవితం గడిపాడో తనకే తెలియటంలేదు— తనొక శాపగ్రస్తుడు. అన్నీవుండి అనుభ వించలేని అభాగ్యుడు— 'ఆడపిల్లలా ఏడు స్తున్నావా' అని ఓ రోజు అన్నయ్యలు హాస్యంచేస్తే సిగ్గుపడ్డాడు కాని తరువాత జీవితం అంతా ఆడదానికంటె అధ్వా న్నంగా ఏడుస్తూ గడపాల్సి వస్తుందని ఏనాడూ ఊహించలేదు—' ధారాపాతంగా ఓడిపోతున్న అశ్రువుల్ని .ఒత్తుకోవాలనే ధ్యాసకూడ అతనికి లేదు — అంతటి దుఃఖాన్ని ఒక్కడూ భరించటం సాధ్యం కాదనీ, తన బాధంతా ఎవరికయినా చెప్పు కుని ఒక్కసారి భోరున ఏడవాలనీ ఓ కోరిక చిత్రంగా తల ఎత్తింది. కాని ఎవరితో చెప్తాడు, తన కెవరున్నారు— తను ఈ విశాల ప్రపంచంలో తోడులేని ఒంటరి బాటసారి. అందరూ వుండి ఎవ్వరికీ చెందని ఏకాకి—

హృదయాన్ని పిండే అంతటి బాధలోనూ తనకి ఒక్కటే తృప్తి మిగిలింది—తను ఎలాంటి పరిస్థితులలోనూ నిగ్రహాన్ని కోల్పోకుండా నియమబద్ధమైన జీవితాన్ని గడిపాడు. తన పిల్లలు కష్టం అంటే ఏమిటో తెలియకుండా హాయిగా సంతో షంగా పెరిగారు.

ఇవాళ ఆ పిల్లలు పెద్దవా ళ్లయారు. తనఅండదండలు లేక పోయినా వాళ్లు సుఖంగా వుండగలరు. వాళ్లవెంటే వుండి అన్ని విధాల వాళ్లకి అవరోధంగా వుండేకంటె వాళ్ల మార్గం లోంచి తప్పుకోటమే ఉత్తమం.

* * *

మామూలుగానే తెల్లవారింది, కాని ఆ ఇంట్లో మనుష్యులు మాత్రం ఎప్ప టిలాలేరు—ఎవరికివారే అవతలివారి మొహంలోకి చూడటానికి సిగ్గుపడు తున్నట్లు బెదురుతున్నట్లు ఒకరినొకరు తప్పించుకుని తిరగసాగారు.

రోజూలాగే కాఫీతీసుకొచ్చి తండ్రికి ఇచ్చాడు మధు—తండ్రి ఎదురుగా అంత సేపు మౌనంగా కూర్చోటం బాగుండదని, ఏదైనాసరే మాట్లాడాలని అతను ఎంత గానో ప్రయత్నించాడు. కాని, ఎవరో రెండు చేతులతోటి గొంతు నొక్కేస్తు న్నట్లు, ఒక్క మాటకూడ అతని గొంతు పెగిలిరాలేదు. అతని అవస్థ గ్రహించిన నిరంజనం తనే కల్పించుకుని ఏవో అడ గటం మొదలుపెట్టాడు. మధు మనసు కొద్దిగా కుదుటబడినా ధైర్యం చాలనట్లు



# సైంటిస్టులు

## నొప్పిని అతి శీఘ్రంగా తొలగించుటకు విధానమును

# కనుగొన్నారు




# మైక్రోఫైన్డ్ ఆస్ప్రో

ఇప్పుడు, మొదటిసారిగా భారతదేశంలో ప్రవేశపెట్టబడినది

**బాధ మీద సమస్య:** "ఆస్ప్రో" యొక్క పరిశోధన సంస్థలో, బాధ యొక్క సమస్య మీద పని చేస్తున్న సైంటిస్టులు ఇప్పుడు, క్రొత్త మైక్రోఫైన్డ్ ఆస్ప్రోను కనుగొన్నారు — ఇది బాధను అతి శీఘ్రంగా పోగొట్టే సాధనము.

**మైక్రోఫైన్డ్ అంటే ఏమిటి:** మైక్రోఫైన్డ్ అంటే, ఆస్ప్రోలోని నొప్పిని పోగొట్టే పదార్థము ముప్పది రెట్లు సన్నగా క్రొత్త ప్రత్యేకమైన పద్ధతిలో చెయ్యబడినది. ప్రతి మాత్రలోను ఇప్పుడు ఇంచుమించు 15 కోట్లు అతి సూక్ష్మమైన అణువులు వుంటాయి. అందువలన, రెండింతల కన్నా ఎక్కువగా నొప్పిని పోగొట్టే శక్తి అతి శీఘ్రంగా పని చేసి, మూడు రెట్లు శీఘ్రంగా నొప్పిని తొలగించును.

**అతి శీఘ్రంగా పని చేస్తుంది-చాలా సేపు వుంటుంది:** క్రొత్త మైక్రోఫైన్డ్ ఆస్ప్రోలోని చురుకైన, పదార్థము సునాయాసంగా, అతి త్వరగా ఇమిడి శరీరమందు 6 నుండి 7 గంటల దాకా వుంటుంది. ఇందువలనే, మైక్రోఫైన్డ్ ఆస్ప్రో అతి శీఘ్రంగా నొప్పిని తొలగిస్తుంది, మరియు చాలా సేపు వుంటుంది.

**తీసుకోవడం చాలా సులభము:** క్రొత్త మైక్రోఫైన్డ్ ఆస్ప్రోను మీకు ఇష్టమైనట్లు తీసుకోవచ్చును. అలాగే కాని, నీళ్లలో కలిపి కాని, ఒక గ్లాసుడు నీళ్లలో కాని, లేక వేడి పానీయముతో కాని తీసుకోవచ్చును.

**వీటికోసం క్రొత్త మైక్రోఫైన్డ్ 'ఆస్ప్రో'ను వాడండి:** నొప్పి, తల నొప్పి, ఒళ్లు నొప్పి, పంటి పోటు, కీళ్ల నొప్పి, జ్వరముతో కూడిన జలుబు, ఫ్లూ, కీళ్ల నొప్పులతో కూడిన జ్వరము, గొంతుగనొప్పి.

**మోతాదు:** పెద్దవారికి: రెండు బిళ్లలు, అవసరమైతే మళ్లీ వేసుకోండి. పిల్లలకు: ఒక బిళ్ల, లేక డాక్టర్ సలహా ప్రకారము వేసుకోవలెను.

క్రొత్త మైక్రోఫైన్డ్ 'ఆస్ప్రో' ఈ విధంగా పనిచేస్తుంది




బిళ్లలోని అణువు ఎంత పెద్దదిగా వుంటే అంత నెమ్మదిగాను అది ఇముడుతుంది— అందువల్ల మీకు, నొప్పి తగ్గటానికి చాలా సేపు అగాలి.




ఇది మైక్రోఫైన్డ్ చెయ్యబడుట వలన, ప్రతి, క్రొత్త మైక్రోఫైన్డ్ ఆస్ప్రో, బిళ్లలోను ఇంచుమించు 15 కోట్ల అతి సూక్ష్మమైన అణువులు వుంటాయి. ఇందువలన, అవి అతి త్వరగా ఇమిడి, అతి శీఘ్రంగా నివారణ నిచ్చును.

క్రొత్త మైక్రోఫైన్డ్ 'ఆస్ప్రో', నొప్పిని, నివారించుటకు, ఇప్పుడు మీకు లభించే వాటిలో అతి ఆధునికమైన సాధనము.









మైక్రోఫైన్డ్

ఆస్ప్రో

అతి శీఘ్రంగా నొప్పిని తొలగించును

నికోలస్ ఉత్పత్తి

# జీవనరాగం

ఎటో చూస్తూ ఎలాగో సమాధానం చెప్పాడు—అలా మాట్లాడుకుంటున్న సమయంలో, తన నిశ్చయాన్ని కొడుక్కి చెప్తే బాగుంటుంది అన్న ఆలోచన చాలాసార్లు వచ్చింది నిరంజనానికి. కాని, ఏం చేయాలో ఏమిటో ఏదీ ఇంకా ఓ నిర్ణయానికి రాలేదు. ఇంకొకరికి ఏమని చెప్తాడు.

ఓ అరగంట గడిచాక పోస్ట్ అన్న కేక వినిపించింది. గదితలుపులు తెరుచుకుని నిరంజనం, హాల్లోంచి సుధ ఒక్కసారే వరండాలోకి వచ్చారు. పోస్టుమాన్ బల్లమీద పడేసిన కవరుమీద నిరంజనం పేరు చూసి సుధ లోపలికి వెళ్ళిపోయింది.

అంత బాగా పరిచయంలేని దస్తూరీ చూసి ఎవరా అనుకుంటూనే కవరు తీసుకుని వెనక్కి తిప్పాడు. దానిమీద స్నేహితుడి ఎడ్రసు వుంది. నిరంజనం హృదయంలో సంతోషపుటల కొద్దిగా కదిలింది. ఈ ఉత్తరం తన కేదయినా మార్గం చూపించవచ్చును అన్న భావం అంతకంతకీ బలపడుతూండగా ఆత్రంగా కవరు విప్పాడు.

అతని ఆశ నిరాశ కాలేదు—ఆ స్నేహితుడు అదివరకెప్పుడో చెప్పినట్లు ఒక పంచదార ఫ్యాక్టరీ పెట్టటానికి అన్ని ఏర్పాట్లు చేశాడు—నిరంజనం పదిహేను వేల రూపాయల విలువగల షేర్లు తీసుకుంటే అతన్ని ఓ డైరక్టర్ని కూడ చేస్తాడు. 'డైరక్టర్ని అవాలనే కోరిక నాకు లేదు' అని తప్పించుకోకుండా ఆ మొత్తాన్ని తప్పకుంగా పంపిస్తాడనే ఆశిస్తున్నాడా స్నేహితుడు- అందరికీ షేర్లు అమ్మి దాన్ని పబ్లిక్ లిమిటెడ్ కంపెనీగా చెయ్యదలచుకోలేదు. కొంతమంది ముఖ్యమయిన బంధువులు స్నేహితులు కలిసి దాన్ని నిర్వహించా లనుకుంటున్నారు—ఈ విషయంలో తనని నిరాశపరచవద్దని మరీ మరీ కోరుతూ ఫ్యాక్టరీని గురించిన మిగతా వివరాలు, రాబోయే కనీసపు లాభాలు అన్నీ విశదంగా తెలియజేశాడు.

(ఇంకా వుంది)




నెలంటా డబ్బు సర్దడం అన్నది ప్రతి గృహిణీ ఎదుర్కొనే తలనొప్పి. అదేమై పోతుందోగాని చేతికొచ్చిన డబ్బు ఇట్టే కరిగిపోతుంది! నెల చూడబోతే పదిరోజులైనా నడిచి ఉండదు! ఏ రోజుకారోజు డబ్బులిచ్చి కొన్నా, వారానికోసారో, నెలకోసారో ఇచ్చి కొన్నా డబ్బు ఒక్కలాగే ఖర్చయిపోతుంది. కాని జీవితంలో నిత్యావసరాలు, ఖర్చు చేసితీరవలసినవి కొన్ని ఉంటాయి. వాటిని కాదని డబ్బు ఖర్చు పెట్టలేం—ఇంటిఅద్దె, ఆహారపదార్థాలు, పాలుపెరుగులు, ఇలా కొన్ని ఉంటాయి. ఇవి కావలసినప్పుడు డబ్బు చేతిలో లేకపోవడం ఇబ్బందే. ఇవీ, వీటి తాలూకు బిల్లులు చేతికి వచ్చినప్పుడూ డబ్బు లేకపోతే మరీ కష్టం. అందుకే ప్రతిగృహిణీ మాచాయిగానైనా రాబడి 'ఈవిధంగా' ఖర్చు పెడదాం అని ఓపద్ధతి అనుకోవడం ఎంతైనా అవసరం. ఖర్చులు సర్దడం అనండి, బడ్జెటింగ్ అనండి—ఈమాట చాలా కష్టమైనదిగా గోచరించినా ఒకసారి ప్రయత్నిస్తే మరీ అంత భయపెట్టదు. ప్రత్యేకించి వీరికనీ, వారికనీ ఖర్చుల పట్టిక తయారుచేయడం కష్టం. ఎందుకంటారా? ఏరెండు కుటుంబాలకీ ఖర్చులు ఒక్కలా వుండవు; వాళ్ల అవసరాలు ఒక్కలా ఉండనట్టే!

అందుకే ఎవరి ఇంటికి బడ్జెట్ వారే తయారుచేసుకోవాలి. ఖర్చులు ఏమిటి? అన్నవన్నీ వరసగా వేసుకోవాలి—ఇంటిఅద్దె, కరెంటుఖర్చు; బొగ్గులు వగైరా, ఇంటి సామాను, ఆహారపదార్థాలు, నూనె, నెయ్యి వగైరాలు, చాకలిఖర్చు, బట్టలు, కొనవలసినవి, చేతిఖర్చు—ఇలా ఓజాబితా వేసుకోవాలి. (వీటితోపాటే ఎంత వెనకవేయాలి? అది కూడా ఒకటి తప్పనిసరిగా వేసుకోవడం మంచిదేగాని ఎలా మిగల్చడం అని అంతా కోప్పడవచ్చు!) ఈ జాబితా చేతిలో పెట్టుకొని వీరూ వీవారూ రాబడి ఎలా పంచుతారో నిశ్చయించుకోవాలి. (ఎప్పటికప్పుడు రూపాయి అర్ధ ఇచ్చే భర్తలనేం అనకండి! అది వారి అలవాటు!) ముఖ్యమైనవాటికీ, అవసరమైనవాటికి, కట్టితీరవలసినవాటికి డబ్బు జాగ్రత్తగా కేటాయించుకోవాలి. దాన్లోనే భర్తగారి రోజాఖర్చులకి, పిల్లలకి అప్పుడూ అప్పుడూ కావలసినవాటికి, డబ్బు ఉంచాలి!

సాధారణంగా సంపాదనలో సగంభాగం భోజనాదులకి పోతుంది. మిగిలిన సగంలో అద్దెలూ ఇత్యాదులకి చాలాభాగం పోతుంది. ఆ మిగిలినదేదో దాన్ని బట్టలకని, సరదాలకని ఎదురుచూడని అవసరాలకని ఖర్చు చేస్తూండాలి.

# డాక్టర్ కబుర్లు

## పథ్యాలు

తినేవారికి రుచిగా లేని పథ్యం ఆహారాలు వండిపెట్టి ఏమి లాభం?

ఉప్పు, కారం లేని ఆహారం వండినా వాటని అలాగే వడ్డించాలా? కంటికి ఇంపుగా ఉండాలి కదా.

నాకు తెలిసిన పత్రికా రచయిత ఒకతను ఉన్నాడు. అప్పుడప్పుడు వట్టి ఓట్‌మీల్ మాత్రం తింటాడు. అతని భార్య అదేదో విందులో పిండివంట పెట్టినట్లు వడ్డిస్తూ ఉంటుంది. చక్కటి టేబిల్ క్లాత్, బల్లమీద పూలకుండి, నేపథ్యంలో సంగీతం అమరుస్తుంది. ఓట్‌మీల్ ఎంతో రుచిగా ఉంటుంది అతనికి...

పథ్యాలు చేసేవారికి తిండి మీద విసుగు పుడితే వారు తినే పదార్థాలని అందంగా చెయ్యాలి.

కడుపు ఎంత ముఖ్యమో, మనసూ అంత ముఖ్యమే—రుచికి.



హెచ్. ఎల్. హెర్మాన్‌సన్
(కాపీరయిటు)

బడ్జెట్ వేసుకుంటే అది చూసి ఖర్చు చేసుకుందుకేకాని మరి అటు డబ్బు యిటు రానివ్వకూడదనికాదు. ఇలా ఓపద్ధతి అనుకుంటే ఎప్పుడేనా సరదాకో సినిమాకి పోవాలన్నా, ఓ జాకెట్టుగుడ్డ కొనుక్కోవాలన్నా దేనిలోంచి డబ్బు తీయవచ్చు? దేన్ని కుదించి యీనెల నెట్టేయవచ్చు? అన్నది సులభంగా తెలుస్తుంది. డబ్బు ఎలా అయిపోయింది? అన్న సీరసం పట్టి పీడించదు. ఖర్చు ఎలా అయిందో కళ్లముందు తెలుస్తూనే ఉంటుందికదా?

ఒకసారిలా ఖర్చుచేయాలి అనుకున్నప్పుడు వీలైనంతవరకు దానికి కట్టుబడి ఉంటే ఫలితాలు కన్పిస్తాయి. రోజువారీకర్చు పద్దు రాసుకోవడంవల్ల దేనికెలా డబ్బు ఖర్చు అవుతుందో తెలుస్తుంది. నెలచివర ఖర్చులు కలిపిచూస్తే దేనికెంత అయిందో తెలుస్తుంది. అవి చూచాయిగానైనా మనం వేసుకున్న బడ్జెట్‌కి కొంచెం దగ్గరలో ఉంటే—నయం అన్నమాట! అలా అయితే, ఖర్చులు అనుకున్నట్టు జరుగుతున్నాయన్న మాట. అలా లేకుంటే, కావలసిన సద్దుబాట్లు చేసుకుంటూ ఉండవచ్చు. ఇక్కడే కొంచెం చిక్కుగం పని చేయవలసి ఉంటుంది. అడపా తడపా రూల్సు పాటించకపోవడం

# ఇదీ దారి

(వేహూదింకాదు—మనం నడిపించేది ఇల్లు, సంసారంగాని వ్యాపారం కాదుగదా! ఇటువంటి చిన్న ఉపాయాలు సంసారాన్ని దివాలా తీయించవు. అంటే అటు డబ్బు యిటూ ఇటుడటూ కొంచెం అయినా సద్దుకోవచ్చు. ఒకసారి ప్లాను అనేది వేసుకొంటే వీలైనంతవరకు దాన్ని అమలులో పెట్టడానికి పాటుపడాలి. అప్పుడే తెలుస్తుంది—నెలాఖడి చివరంటా వచ్చేలా చూడడం మరీ అంత బ్రహ్మవిద్య కాదని!

**వంటలు:**

## కేబేజి సాలాడ్

1 చిన్న కేబేజి.
1 ఉల్లిపాయి.
3 చెంచాలు కొబ్బరి కోరు.
½ చెంచా మిరపపొడి.
1 నిమ్మకాయ రసం.
ఉప్పు.

కేబేజి సన్నగా తరిగి కడిగి, నీరు వాడ్చేసి ఉంచుకోవాలి. ఉల్లిపాయి సన్నగా తరిగి—కేబేజిలో కలిపేయాలి. తరవాత ఉప్పు, కారం పొడి, కొబ్బరి కోరువేసి కలియపెట్టి నిమ్మకాయ రసం వేయాలి. అన్నంతో పాటు తినడానికి ఉట్టివే తినడానికి కూడా రుచిగా ఉంటుంది.

## వేపుడు వంకాయ

అరకిలో చిన్నవంకాయలు.
1 స్పూను మెంతులు.
1 అల్లం ముక్క.
4 వెల్లుల్లి రేకలు.
4 పచ్చిమిరపకాయలు.
2 చెంచాల పెరుగు.
1 స్పూను గరంమసాలపొడి:
ఉప్పు.

వంకాయలు గుత్తులా కోసి ఉంచుకోవాలి. మెంతులు మొదలైనవి వేయించి ముద్దగా నూరి పెరుగుతో కలిపి ఆ ముద్ద ఈ వంకాయలలో కూరాలి. వంకాయలు విడిపోకుండా దారంతో కట్టవచ్చు. వెడల్పాటి కళాయిలో కొంచెం నూనె, అన్నే నీళ్లు పోసి వంకాయలు వేసి మూతపెట్టాలి. వంకాయలు బాగా ఉడికాయన్నాక, మసాలాపొడీ జల్లి మూత పెట్టాలి. ఓ పదినిమిషాలు మగ్గనిచ్చి దింపుకోవాలి. దారం విప్పి వంకాయలు వడ్డించుకోవచ్చు. బిరియానీవంటివాటిలోకి ఈ కూర చాలా బాగుంటుంది.

# ధర్మప్రవర్తన

'ప్రాచీనులు మన సామ్రాజ్యంలో ధర్మప్రవర్తనని నిరూపించటానికి ముందు వివిధ రాజ్యాలలోని పరిస్థితులని చక్కపెట్టేవారు; వీటిని చక్కపెట్టేందుకు తమ కుటుంబాలని సరిగ్గా నడుపుకునేవారు; వీటిని సరిగ్గా నడుపుకునేందుకు తమ వ్యక్తిత్వాలని వికసింప చేసుకునేందుకు ప్రయత్నించేవారు; ఈ వికాసానికి తమ హృదయాలని నిష్కల్మషంగా ఉంచుకునేవారు; కల్మషరహితంగా ఉండటానికి తమ ఆలోచనలని విశుద్ధం చేసుకునేవారు; విశుద్ధంగా చేసుకొనటానికి తమ జ్ఞానాన్ని వీలయినంతదాకా పెంపొందించుకునేవారు; జ్ఞానాభివృద్ధికి వస్తువుల అనుశీలన అధికం చేసుకొనాలి. ఈ అనుశీలనద్వారా జ్ఞానం సంపూర్ణం అవుతుంది. పరిపూర్ణ జ్ఞానంతో ఆలోచనలు శుద్ధంగా ఉండి, హృదయం కల్మషరహితం అయి, వ్యక్తిత్వం వికసించి. కుటుంబ నిర్వహణ నిదానమయి, రాజ్యాలు సుస్థిరం అయి, పరిపాలన బాగుపడి సామ్రాజ్యం అంతటా ధర్మప్రవర్తనకి దోహదం ఏర్పడేది.'

ఇవి ఒక ప్రాచీన చెయినా ఋషి చెప్పినమాటలు. ఆ మహానుభావుడి సిద్ధాంతాలలోని సత్యం అంతా వీటిలోనే ఇమిడిఉంది. ఈ సత్యాన్నిమరింత ప్రచారంలోకి తీసుకురావటానికి ఆయన చైనా సామ్రాజ్యంలోని మారుమూలలని పర్యటించేవాడు. ఆయన సిద్ధాంతాన్ని నేడు కన్‌ఫ్యూషియన్ మతం అంటారు.

కన్‌ఫ్యూషియస్ క్రీ. పూ. 6వ శతాబ్దంలో చెయినాలో జన్మించాడు. విద్యాభ్యాసం పూర్తిఅయినతర్వాత ఆయన రాజసేవలో చేరాడు. క్రమంగా న్యాయమూర్తి పదవిలోకి వచ్చాడు. కన్‌ఫ్యూషియస్ పరిపాలనా పద్ధతులు సాధించిన విజయాలని చూసి పయివారు ఆయనని న్యాయశాఖ మంత్రిగా నియమించారు. కాని, ఆయన ఉపదేశాలని ఆరాజ్యం ప్రభువు పెడచెవిని పెట్టడంతో కన్‌ఫ్యూషియస్ విరక్తిచెంది పదవిని వదులుకున్నాడు. ఆతర్వాత ఆయన ఇతర రాజ్యాలనిగూడా పర్యటించి వాటి ప్రభువులని మార్చాలని ప్రయత్నించాడు. ఈ ప్రయత్నాలు ఫలించలేదు ఆకాలంలో చెయినాని చవ్ (లేక జో) చక్రవర్తులు పాలించేవారు; అయితే వారిది నిరంకుశపాలన కాలేకపోయింది సామంతరాజ్యాలవారు ఎన్నో విషయాలలో స్వతంత్రంగా ప్రవర్తించేవారు. ఎప్పుడూ యుద్ధాలూ, కరువులూ కాటకాలను ప్రజలు తరచు మలమల మాడిపోతూ ఉండేవారు. సద్బోధనలతో శాంతిని నెలకొల్పాలని కన్‌ఫ్యూషియస్ అనుకునేవాడు. అతని ఆశ నెరవేరలేదు. కన్‌ఫ్యూషియస్ తన చివరిరోజులు స్వరాష్ట్రంలోనే గడిపాడు. ఆకాలాన్నంతా సాహిత్యసేవకే వినియోగించాడు.

మానవుడు సహజంగా మంచివాడని కన్‌ఫ్యూషియస్ నమ్మకం. సరయిన సంస్కారంతో మానవుడు పరిపూర్ణత్వం చెందగలడని కూడా అతని నమ్మకం. కన్‌ఫ్యూషియస్ కొత్త మతాన్ని దేనినీ స్థాపింపలేదు. ప్రాచీన సాంప్రదాయాలనే ఉద్ధరించి మనుష్యులని బాగు చేద్దామని చూశాడు. కన్‌ఫ్యూషియస్‌కి కొంచెం ముందు జన్మించిన మరొక మహాఋషి అన్నాడు. జీసస్ తర్వాత అన్నట్లు: 'నీ శత్రువులని ప్రేమించు!' అని.

'అయితే మంచితనానికి బదులుగా ఏమి ఇస్తావు ? మంచికి మంచి, చెడుకి న్యాయం బదులుగా ఇవ్వాలి.' అన్నాడు కన్‌ఫ్యూషియస్. ఆయన అద్భుతాలని గురించి కాని, పరలోకాన్ని గురించి గాని చెప్పలేదు పితరుల ఆత్మలని ఏవిధంగా పూజించాలని ఒక శిష్యుడు ఆయనని అడుగగా, 'ముందు బతికి ఉన్నవారిసేవ చెయ్యాలి కదా!' అని సమాధానం ఇచ్చాడు కన్‌ఫ్యూషియస్. అలాగే. 'జీవితం అంటే తెల్సుకుంటే గాని మరణానంతరం ఏమి ఉందో తెలుసుకోలేము,' అని మరొక ప్రశ్నకి జవాబుచెప్పాడు. కన్‌ఫ్యూషియస్ బోధించిన సిద్ధాంతాలు 2500 సంవత్సరాలుగా చెయినా దేశచరిత్రలో ప్రతిబింబిస్తూనే ఉన్నాయనటంలో అతిశయోక్తిలేదు.

— ఎస్

అభియోగాలలో వింతలు:

## కుమార్తె పెండ్లికి అవరోధం కల్పించిన మాజీరాణి

తన ఆఖరి కుమార్తె ఒక నటుణ్ణి వివాహ మాడడానికి వీల్లేకుండా ఇటలీ మాజీ రాణి మేరీ జాస్ న్యాయవాదిచేత నోటీస్ ఇప్పించినది. యువరాణి మేరియా బియాట్రిస్ మనస్సు సరిగ్గా లేదు కనుక ఆమె చేసే పనులకు ఆమె బాధ్యత వహించడంలేదని ఈ మాజీ రాణి వాదన.

1946 లో ఇటలీ ప్రజలు రెఫరెండమ్‌ద్వారా రాజరికానికి స్వస్తిచెప్పారు. సివాయ్ రాజవంశంలోని ఈ రాకుమారి వయస్సు 25 సంవత్సరాలు. నటుడు మేరిజియో ఆరెనాను ఆమె ప్రేమించింది. ఆరెనా వయసు 34 సంవత్సరాలు. వంగీత నటుడుగా పేరు సంపాదించాడు. కానీ గత అయిదు సంవత్సరాలలో ఒక్క ఫిలిమయినా నిర్మించలేదు.

రోమ్ శివార్లలోని ఆరెనా నివాసానికి రాకుమారి బియాట్రిస్ ఇటీవల వెళ్ళింది. 'వచ్చేనెలలో చర్చిలో మా పెండ్లి జరుగుతుంది' అని ప్రకటించింది. అప్పటినుంచి ఆరెనాతోనే వుంటున్నది.

'ఎన్ని అవాంతరాలెదురొచ్చినా మా పెండ్లి జరిగి తీరుతుంది' అంటున్నది.

— వి. ఎస్. అవధాని

# కాలం కదిలింది

శ్రీమతి శరణాల జయలక్ష్మి




'నేను వీగా భార్యని బానిసని కాదు.'

శాంత ఆలోచిస్తోంది. ఆ మాటలు అంది నిజంగా తనేనా అని: ఏ అదృశ్య శక్తి తనచేత అలా మాట్లాడించింది? ఆరేళ్ళ బానిసగా బ్రతికింది. ఈరోజు తనకి భార్యని అని క్రొత్తగా ఎందుకి గుర్తుకి వచ్చింది?

వత్తులు బాగా కాలి కాలి వున్నాయేమో ఎర్రగా మండుతున్న స్టౌ మంటని తదే కంగాచూస్తూ ఆలోచిస్తోంది శాంత. వత్తులని సరిపి సైకితిస్తే నీలం రంగులో చురుకుగా మండుతాయి. కాని స్త్రీ సహజ మైన సుకుమారత్వాన్ని కోల్పోయి, చిల్లులు పడిన తన మనస్సు? ఆయన ప్రేమాదర ణలు లభిస్తే తనూ ఉత్సాహంగా ఆనం దంగా వుండగలదేమో—ఎంత అత్యాశ! నీరసంగా నవ్వుకుంది.

కుడిచేతి గాజులు చిట్లి లోతుగా గుచ్చు కోవటంలో ఏకధారగా రక్తం కారి కారి గడ్డకట్టుకునిపోయింది. ఈగలు వాలుతున్న ఆ గాయాన్ని చూసుకుంటూ, ఎడమ చేతితో నుదురుమీద ఎత్తుగా ఉబ్బిన బొడిపిని తడుముకుంది—భర్తనుండి తనకి లభించినవీ, లభించేవీ అవే! అవే తమ దాంపత్య జీవితంలో తనకి మిగిలిన అను భూతులు.

శాంత ఒకక్షణంపాటు తన ఆలోచనల రీతికి విస్తుపోయింది. ఏమిటిది? ఈరోజు తనెందుకిలా విచిత్రంగా ఆలోచిస్తోంది? కాళ్ళు కడిగి కన్యాదానంచేసి రాజారావు చేతిలో తనని పెట్టిన క్షణాన్నే బరువూ బాధ్యతా అతనికి వప్పగించి చేతులు దులుపుకున్నాడు అన్నయ్య. ఎన్నెన్నో ఆశలతో, అందమైన కలలతో నూతన వధువుగా క్రొత్తజీవితంలోకి అడుగు పెట్టింది.

కాలం కదులుతోంది. తన ఆశలూ ఆశయాలూ అన్నీ కరిగిపోయాయి. క్రమంగా ఆలోచించటంకూడా మరిచి పోయింది తను. దైనందిన జీవితంలో భోజనం చేయటం, నిద్రపోవటం అన్నంత సహజంగా భర్తచేత చివాట్లు దెబ్బలు తినటం అలవాటయిపోయింది.

మరి—ఈరోజు తనలో ఎందుకిన్ని ఆలోచనలు క్రొత్తగా రేకెత్తుతున్నాయి?

మోకాళ్ల మధ్య గడ్డం ఆనించి, చెంపకి చెయ్యి ఆన్చి ఆలోచిస్తున్న శాంతకి చటుక్కున గుర్తుకి వచ్చాడు 'మధు'

'ఎలా వున్నారు శాంతా?' తల వంచుకుని ఆఫీసు నుండీ బస్ స్టాండ్‌కి నడుస్తున్న శాంత ఉలిక్కిపడి చూసింది. లాలిత్యాన్ని నింపుకుని గంభీరంగా వుండే ఆ కంఠ స్వరాన్ని ఆమె ఎప్పటికి మరిచి పోలేదు.

ఆశ్చర్యంతో ఆనందంతో ఏమీ మాట్లాడలేక, విస్మయంగా చూస్తూ నిలబడి పోయింది.

'ఏమిటలా చూస్తారు? నన్ను మరచి పోయారా? నేను మధును' ఎప్పటిలా చిరునవ్వు అతని పెదిమల మీద మెరుస్తోంది. చిలిపిగా కళ్ళు నవ్వు తున్నాయి.

'అబ్బే... లేదు.' తడబడుతూ అంది.

మధు నవ్వుతూనే శాంత కళ్లల్లోకి సూటిగా చూసాడు. ఆమె కనురెప్పలు క్రిందకి వాలిపోయాయి. సిగ్గుతో కాదు. కలవర పాటుతో. మధుని చూడగానే కలిగిన సంతోషంతో పాటు ఏదో భయం ఆమెను సన్నగా వణికించింది.

'అలా హోటలుకి వెళ్లి కొద్దిసేపు మాట్లాడుకోవటానికి ఏమయినా అభ్యంతరముందా?' అతని కంఠ స్వరంలో లాలిత్యం లేదు. గంభీరంగా వుంది.

ఆ మార్పుని గమనించి తలెత్తింది శాంత. అతని కళ్లల్లో చిలిపితనం కరిగి పోయింది. నిశితంగా ఆమెని పరికిస్తూ ఏదో అర్థం చేసుకొవటానికి ప్రయత్ని స్తున్నాయా చూపులు,

'అబ్బే...లేదు' అరిగిపోయిన టేపు రికార్డర్‌లా, తడబాటుని అణుచుకోవ టానికి ప్రయత్నిస్తూ అంది.

మధు నవ్వాడు. 'మీకు అభ్యంతరం వుంటుందని కాదు. కానీ మీ శ్రీవారికి యిలాటివి...'

సూటిగా తగిలాయా మాటలు శాంతలో. యింకా ఏ మూలో మిగిలి వున్న అభి మానం దెబ్బతింది. 'అలాటిదేమీ కాదు. పదండి' అంది మరేమీ ఆలోచించ కుండా.

టిఫిను కాఫీ తీసుకుని తిరిగి వచ్చే వరకూ చాలా మామూలుగా కాలేజీ స్నేహితుల గురించి, లెక్చరర్ల గురించీ మాట్లాడాడు అతను. అతని కళ్ళు మాత్రం నిశితంగా ఆమె ప్రతి కదలికనీ, కళ్లల్లో కదులుతున్న ఛాయలనీ జాగ్రత్తగా గమనిస్తూనే వున్నాయి.

'మీ బస్‌స్టాండ్ దగ్గరకి వచ్చేస్తోంది' మాట్లాడటం ఆపి ఆమె ముఖంలోకి చూస్తూ అన్నాడు.

కాలేజీ స్మృతులు గుర్తు తెచ్చుకుంటూ ఉత్సాహంగా మాట్లాడుతున్న శాంత చటుక్కున మాట్లాడటం ఆపి వేసింది. అందమైన కలలు కంటున్న రోగిని హఠాత్తుగా లేపి. చేదు మాత్రలు మింగ మన్నట్టు తెల్లబోయి చూసింది అరక్షణం పాటు.

'యిల్లూ తనూ, ఆ మనిషీ—' తన జీవితం బాధ్యతలూ గుర్తుకి రాంగానే దిగులుగా నిట్టూర్చింది.

'అవును, బస్‌స్టాండ్ వచ్చేస్తోంది' నిరసంగా అంది.

అతని చిన్న చిన్న కళ్లల్లో అంతు లేని జాలీ, బాధా తొంగి చూసాయి.

'కొద్దిసేపు ఈ పార్కులో కూర్చుని వెళదాం. రండి' అతను చనువుగా పార్కులోకి దారి తీసాడు.

'రాలేను' అనాలనుకుంది శాంత. కానీ అనలేక పోయింది. ఏవో మొండి తనం, ధైర్యం ఆమెని ముందుకి నడిపించాయి.

'మీ సంసారం ఎలా వుంది?' పచ్చ గడ్డిలో చేతి రుమాలు పరుచుకుని కూర్చుంటూ సూటిగా అడిగాడు మధు.

ఏ క్షణాన అతను అలా అడుగుతాడో అని కలవర పడుతున్న శాంత కొద్ది సేపటి వరకూ ఏమీ మాట్లాడ లేక పోయింది.

'మాట్లాడరేం?' అతని చిన్న చిన్న కళ్ళు తన ప్రతి కదలికనీ పరికిస్తున్నా యని తెలుసు శాంతకి, చివరికి తలెత్తి చూసింది 'ఏం చెప్పను?' అంటూ.

'కాలం చాలా త్వరగా కదిలి పోతోంది. మిమ్మల్ని చూసి అప్పుడే ఏడు సంవత్స రాలు అయ్యింది. మీ శ్రేయస్సుని సదా కాంక్షించే ఆప్తులలో నేను మొదటి వాడిని మీ జీవితం ఎలాగుందో తెలుసు కోవాలని ఆరాటపడటంలో తప్పేమీ లేదనుకుంటా' ప్రతిమాట వెనుక ఏదో తెలుసు కోవాలన్న వేదన, యింకా ఏదో చెయ్యాలన్న తపన, స్నేహ పూరితమైన వాత్సల్యం తొంగి చూస్తున్నాయి.

తల వంచుకుని గడ్డి పరకలు పీకుతూ మౌనంగా వుండి పోయింది శాంత. గర్వంగా తృప్తిగా సంతోషంగా చెప్పుకోవటానికి నాకేమీ మిగల్చలేదు ఈ ఏడేళ్ల కాలం.

'ఏ బంధుత్వమూ లేని మీరు నాకు ఆప్తులూ సన్నిహితులూ అని నాభర్తకి తెలిస్తే నన్ను ఎన్నివిధాల హింసిస్తాడో మీకు చెప్పనా మధూ? ఎంత చదువు కున్నా, ఎంతమంది మధ్యలో ఉద్యోగం చేస్తున్నా, ఎవరితోనూ ఎలాటి పరిచయమూ పెట్టుకోకుండా మడికట్టుకుని కూర్చో వాలనే ఆయన తత్వాన్ని మీకెలా చెప్పేది?' బాధగా ఆలోచిస్తోంది శాంత.

బి. ఏ మూడో సంవత్సరం చివరిలో కాలేజీ మూసివేసే చివరిరోజున మధు అడిగాడు. 'యింక ఎవరి జీవితాలు వారివి. ఎప్పుడైనా ఎక్కడయినా కనపడితే మాట్లాడతారా శాంతా?' అని.

'అదేమిటి? ఎందుకు మాట్లాడను?' అంది తను బాధగా.

'ఏమో. ఆడవాళ్లు త్వరగా మారి పోతారంటారు. పెళ్లవ్వగానే పరాయి మగవాడితో మాట్లాడితేనే తప్పన్నట్టు తప్పించుకునిపోతారు కొందరు చదువుకున్న అమ్మాయిలు. మీరూ అలాగే...' అతన్ని పూర్తిగా మాట్లాడనీయలేదు తను.

'మనదగ్గర అలాటివి కుదరదు. ఆకాబోయే ఆయనని లాక్కువచ్చి 'యిదుగో నా బెస్ట్ ఫ్రెండు' అని గర్వంగా పరిచయం చేసి, మీరు రానని బతిమాలినా వినకుండా మా యింటికి లాక్కుపోయి అతిథి మర్యాదలు చేస్తాను. తెలుసా?' అంది తను నవ్వుతూ.

అవి గుర్తుకివచ్చి శాంతకళ్ళు నీళ్లతో నిండాయి. అతనెక్కడ చూస్తాడో అని తలపూర్తిగా వంచేసుకుంది.

'సారీ. మీరు చెప్పరు. చెప్పలేరు అని తెలిసికూడా అడిగాను శాంతా. మగ వాళ్లం అనే అహం యింకా కొందరు భర్తలలో పోలేదు. ఆడదాన్ని, అణిగి మణిగి వుండాలి అనే తేలికభావం

## 18 క్లూలకు తెలుగు అనువాదం

1. ఆహారం లేక పోయినట్లయితే మానవునికి ఆహారం కోసం ఆసక్తి ఎట్లు కలుగకపోతుందో అలాగే మానవులు అమరులై యుండక పోయినట్లయితే మానవులు అమరత్వమును సాధించరు/ఆశించరు.

2. స్వసుఖ త్యాగం ఆత్మసంయుత మరియు దయ / వినమ్రత యందు అద్వితీయ ఆనందమున్నది.

3. కర్తవ్యభావమందు అంత్యపరాయణ/ సదా వారి మనోవృత్తి అంతర్నిహితమై యుండును.

4. భూలోకంలో ఎవ్వరూ నియతి క్రమగతిని / బలమును ఎదిర్చి నిలువ జాలరు.

5. క్రూరత్వం / శత్రుత్వం మరియు లోభం మానవ సహజ గుణముల క్రూరతను పూర్తిగా పురికొల్పి మానవుని క్రూరపథమునందు దింపును.

6. మానవుడు వ్యక్తిగతంగా నశించును కాని అతని మహా కార్యములు / భావములు వాటిపూర్వ సాంప్రదాయంగా ప్రత్యేకించి అమరమై నిలిచి యుండును.

7. ఎడతెగని నిరాశ / దుఃఖము మరియు శూన్యతతో ఎవ్వరూ జీవించజాలరు.

8. శిక్షణ / ధర్మం యొక్క ముఖ్య కార్యకలాపం సామాజిక ఏకాగ్రతను బలపరచుటయందే నిమగ్నమై యుండును.

9. ఎవరైనా అహంభావమును బ్రహ్మాండంగా పెంచగలరు, దానిని భయంకరంగా పెంచుదురు కాని మేరలేకుండా / అజేయంగా కాదు.

10. ప్రకృతి ఎల్లచోట్లా విధులను/ హద్దులను నిర్ణయించింది.

11. ఏ ఛత్రాధిపత్య సామ్రాజ్య మనోకాంక్ష నిమిత్తం ఆశాపిశాచాగ్నికి మనము ధారాళంగా/ సరిగా మనుష్యులను జడమైన సామగ్రిని ఆహుతినీయ వలసి యుంటుంది.

12. ఈశ్వరుని మీ ఆత్మలయందు ప్రవేశింపజేసి మీ కార్యాచరణలన్నింటిని పరిపాలింపనిచ్చినపుడు అసహాయత / లౌకికము దానంతటదే మీ నుండి తొలగిపోవును.

13. మానవ స్వభావము / వ్యక్తిత్వము పూర్తిగా జ్ఞానహీనమై సదను సిద్ధాంతము తప్పు.

4. కోరికలు, ఉద్దేశములు లేక అలవాట్లు వీటి పరస్పర వైరుధ్యం నైతిక / సామాజిక సమస్యలను కల్పించును.

15. ఈనాడు మనకు రాజకీయ / వ్యవహారిక వివేకం కావలెను అనే విషయమును ఎవ్వరూ కాదనరు.

16. ప్రాపంచిక సుఖానందముల పరిత్యాగం అత్యగ్రస్థానమునందే పవిత్రత / ఆచరణ లభ్యం.

17. కోపోద్రేకం లేక భయోద్రేకం ప్రశాంత చింతనం / మననం అసంభవనీయము మనకు సర్వసామాన్యంగా అనుభవనీయం.

18. ఈశ్వరుని సాక్షాత్కారం అనుభవనీయంగా సాధింప జాలనంతవరకు మానవుడు అజ్ఞానిగాను/ అయోగ్యుడుగాను వుంటాడు.

## 18 CLUES

1. As man could not have desire for food if there were no food, so men could not **Acquire** / **Desire** immortality if men were not immortal.

2. There are unsurpassed joys in self-denial, self-restraint and **Charity** / **Humility**.

3. A sense of duty presupposes a **Conscientious** / **Virtuous** disposition.

4. None on earth can withstand the **Course** / **Force** of destiny.

5. **Cruelty** / **Enmity** and greed give full licence to the barbarity of human instincts and put man on a crooked road.

6. Man as an individual perishes but his **Deeds** / **Ideas**, separate from their progenitor, live on.

7. No one can live with a continual sense of **Despair** / **Pain** and void.

8. The main function of **Education** / **Religion** consists in strengthening social solidarity.

9. One can inflate the Ego tremendously, inflate it frightfully, but not **Indefinitely** / **Invincibly**.

10. Nature has set **Laws** / **Limits** everywhere.

11. We have to sacrifice, **Liberally** / **Literally**, men and material in the fire of ambition in order to create the phantom of an empire.

12. **Loneliness** / **Worldliness** will fall away from you automatically when you allow God to come into your souls and rule all your activities

13. It is wrong to hold that human **Mentality** / **Personality** is basically irrational.

14. A conflict of desires, motives or habits sets a **Moral** / **Social** problem.

15. No one will deny that we need **Political** / **Practical** wisdom today

16. Renunciation of worldly pleasures is the highest kind of **Purity** / **Pursuit**

17. It is common experience that a flood of anger or fear will make calm **Reading** / **Thinking** impossible

18. Man remains **Unaware** / **Unworthy** of himself, as long as he does not realise God.

**గమనిక :** పై క్లూలు భారతీయ గ్రంథకర్తల, పుస్తకములనుండి తీసుకొనబడినవి. అవి పూర్తి వాక్యములు మరియు వేరువేరుగా పూర్తి అర్థవంతమైనవి. గ్రంథకర్తలు, వారి పుస్తకముల పేర్లు అఫిషియల్ సొల్యూషన్‌తో పాటు లిటక్విజ్ పీక్లీలో ప్రచురించబడును. రు. 5,46,000 లకు పైగా పంచి పెట్టడినది.

## కాలం కదిలింది

మిలోనూపోలేదు. కాలం మారింది అలవాట్లూ, అభిరుచులూ అన్నీ మారాయి. కానీ మనసులలోవున్న సంకుచిత్వంమాత్రం యింకా తొలగిపోలేదు.

'అవును. మనది భారతదేశం. ప్రాణాలు బలిపెట్టి అయినా కీర్తికోసం ప్రాకులాడుతాం. సతి సావిత్రి, అనసూయల వంటి పతివ్రతలు వెలిసిన పుణ్యభూమి మనది. సుమతివంటి పతివ్రతల వారసత్వం మాది. ఆ వారసత్వాన్ని పోనీయరు. ఎంత చదువుకున్నా అభ్యుదయంగా బ్రతకలేరు మీరు. అనాదిగా జరుగుతున్న అన్యాయాలకి బలిఅవుతూకూడా పెదవి కదపరు. ఎంత నికృష్టంగా అయినా బ్రతుకుతారు కానీ భర్త గురించి చెడ్డగా చెప్పుకోలేరు. ఆ బలహీనత మిమ్మల్ని ఈస్థితికి తెస్తోంది' అతని స్వరంలో ఆవేశం ఆవేదన పెరిగిపోతోంది.

శాంత కళ్ళనుండి ఏకధారగా జారిపోతున్నాయి కన్నీళ్ళు. ఆడదానికి తరగని ఆస్తి అదే!

కాలం కదలటం మరిచిపోయిందేమో అన్నంత మెల్లగా భయంకరంగా జారిపోతున్నాయి క్షణాలు.

'నేనంతా విన్నాను. ప్రత్యక్షంగా చూసాను కూడా. మీ యింటికి ఎదురుగానే మా బంధువులు వున్నారు. నిన్న ఉదయం మిమ్మల్ని చూడగానే బయటికివచ్చి పలకరిద్దామనుకున్నాను. కానీ మా వాళ్ళు వారించారు. ఆయననలే అనుమానపు మనిషని. రాత్రి ఆలస్యంగా మీరురావటం ఆయన కోపంగా మాట్లాడుతూ చెయ్యి చేసుకోవటం తలుపులు వేసివున్నా వినపడ్డాయి. రాత్రంతా నిద్రపట్టలేదు నాకు. నేను మీ అన్ననో తమ్ముడినో అయితే, కనీసం దూరపు బంధువునయినా అయివుంటే ఎంత బావుండేది! ఆ క్షణంలో వచ్చి రాజారావుని మందలించి బుద్ధి చెప్పి వుండేవాడిని......'

సరిగ్గా మూడేళ్ళక్రితం జరిగినసంఘటన తలుచుకుని కన్నీళ్ళ మధ్య బాధగా నవ్వుకుంది శాంత.

ఏదో పనిమీద ఆ ఊరు వచ్చిన సారథి చెల్లెలి కాపురం ఎలాగుంది చూడటానికి

# కాలం కదిలింది

ఇంటికి వచ్చాడు.

'నీ అన్న యిచ్చిన సొమ్ము చూసుకునా ఆ మిడిసిపాటు? ముష్టి కట్నం డబ్బులు తప్ప ముచ్చటారే లాంఛనాలు జరిపించారా? ఎనభై రూపాయల వెధవ గడియారం, రెండువందలు పెట్టి డొక్కు రేడియో...' పాత విషయాలన్నీ తవ్వి అడుగుతున్నాడు రాజారావు.

అత్తగారింట్లో వున్న మూడురోజులు అత్తా ఆడబిడ్డలు సాధించినా ఓపికగా విని ఊరుకుంది శాంత. అల్లుడి కోరికలు ఆడపడుచుల లాంఛనాలూ ఘనంగా తీర్చటానికి తండ్రి లేరు. ఎలాగో అలా శ్రమపడి చెల్లెలి బరువు తీర్చుకుందామన్న తాపత్రయంతో అప్పుచేసి ముందు అనుకున్నదానికంటె కొస్త ఎక్కువగానే ఖర్చుపెట్టి పెళ్లి చేసాడు సారధి. యింకా అవి పెట్టలేదు యివి పెట్టలేదు అన్న సాధింపులు విని బాధపడినా ఎంతకీ తృప్తి లేకుండా యింకా ఏవో చేయాలని అనుకోవటం ఆడవాళ్లకి సహజం. అందులో అత్తా-ఆడపడుచుల హోదా వచ్చేసరికి తమ అబ్బాయిని చవకబేరంలో కొనుక్కున్నారనీ, యింకా ఎక్కువ వచ్చేది అన్నట్లు మాట్లాడుతారు చాలామంది— అని సరిపెట్టుకుంది.

'నేను పెళ్లిచేసుకుంది కట్నంకోసం, లాంఛనాలకోసంకాదు.' అని తల్లినీ అక్కచెల్లెళ్లని మందలించవలసిన రాజారావు క్రొత్తలోనే కాకుండా పెళ్లయిన మూడు సంవత్సరాలకి కూడా యింకా సాధించటంతో ఎప్పటిలా ఊరుకోలేకపోయింది శాంత.

'ఎనిమిదివందలరూపాయలుపెట్టి చేతి గడియారం, వెయ్యిరూపాయల ట్రాన్సిస్టరు పెట్టకలిగే తాహతు వుంటే వెదికి వెదికి మిమ్మల్ని తేటం ఏం ఖర్మ? ఏ ఆఫీసరునో, డాక్టరునో తెచ్చేవారు' అంది ఒళ్లుమండి.

గోరంతని కొండంతగాచేసి పోట్లాడే రాజారావు మనిషిని అవేమాట మరిచిపోయాడు.

అంతవరకూ వరండాలోనే ఆగిపోయి లోపల సంభాషణ వింటున్న సారధి యింకా సహించలేకపోయాడు. పశువులా ప్రవర్తిస్తున్న అతని చేతిలోనుండి చెల్లెల్ని అవతలకితోసి రాజారావు జబ్బపట్టుకుని ఈడ్చి చెంపమీద ఒకటి వేసాడు.

బావమరిదిని చూసి అరక్షణంపాటు జంకినా, తనమీద చెయ్యి చేసుకోవటంతో పౌరుషంగా ఎదురు తిరగబోయాడు కోపంగా తిడుతూ.

అనుకోకుండా జరిగిన ఈ సంఘటనని చూసి కొయ్యబారి నిలబడిపోయింది శాంత తన బాధని కూడా మరిచిపోయి.

'రాస్కెల్. నా చెల్లెలిని ఎంతెంత మాటలంటావురా? దాన్ని చావమనా నీకిచ్చి పెళ్లిచేసింది? నువ్వు మనిషివా పశువువా? నీ చదువూ సంధ్యా ఏమయ్యాయి...' సారధి తిరిగి చెయ్యి చేసుకున్నాడు. ఆ దెబ్బ బలంగా కణతలమీద తగిలిందేమో రాజారావుకి కళ్లు తిరిగినట్లయ్యి ఏమీ మాట్లాడలేకపోయాడు ఒక నిముషంవరకూ.

పొడుగ్గా బలంగా వుండే సారధి చేతిలో రాజారావు, ఏమయిపోతాడో అన్నభయంతో తన భర్తమీద అన్న చెయ్యి చేసుకున్నాడన్న కోపంతో, తన కాపురం చూడ వచ్చిన అన్నగారి ముందు యింత గొడవ జరిగినందుకు అవమానాభిమానాలతో వణికిపోయింది శాంత.

'అన్నయ్యా...' భర్తకి అడ్డుగా నిలబడుతూ అంది. 'నువ్వెందుకిలా తొందరపడుతున్నావు? చెల్లెలు భర్తతో కాపురం చేయటం నీ కిష్టం లేదా'

'శాంతా' కోపం మరిచిపోయి ఆశ్చర్యంగా చూసాడు సారధి. 'ఏమిటి నువ్వంటున్నది?'

'భర్తకి భార్యమీద చెయ్యి చేసుకునే అధికారం లేదా అన్నయ్యా? ఆ మాత్రానికే నువ్వు వచ్చి ఆయన్ని కొట్టటం ఏమీ బావుండ లేదు. భార్యాభర్తల మధ్య కలతలు రాకుండానే వుంటాయా? మా యిద్దరి మధ్య నువ్వువచ్చి యింత రాద్ధాంతం చేయటం ఏమిటి? చెల్లెలి కాపురం చక్కదిద్దవలసినవాడివి నువ్వే చెడగొడతావా?' అంది ఆవేశంగా.

'శాంతా' ఆగ్రహం ఆవేశాల మధ్య దాదాపు అరిచాడు సారధి. 'నీ కాపురం చెడగొట్టడానికి వచ్చానా నేను?' బాధగా కోపంగా చెల్లెలిని చూసాడు. మరుక్షణం లోనే వెనక్కి తిరిగి చేతిసంచి తీసుకుని తిరిగి వెళ్లిపోయాడు.

'అలా చెప్పు! బుద్ధివుంటే తిరిగి జన్మలో

ఈ గడప తొక్కవద్దను' రాజారావు తేసుకొని చెంప సవరించుకుంటూఅన్నాడు వెనుకనుండీ.

గడప దాటిన పారథి మళ్లీ చెల్లెలి యింటి గడప తొక్క లేదు. లోలోపల కుమిలిపోయింది శాంత. ఆ తరువాత ఏడాదికి తన దిగులుతోనే పోయిన తల్లి శవాన్ని చూడటానికి మాత్రం వెళ్లింది శాంత. అప్పుడయినా ముభావంగా అంటీ అంటన్నట్టు వున్నారు అన్నా వదినా.

ఆలోచనల మధ్య బిగుసుకుని పోయిన శాంతని చూసి మధు లేచి నిలబడ్డాడు.

'మీ స్వవిషయాలలో నేను కల్పించుకోవటం మీకు యిష్టం లేదనుకుంటా. నన్ను క్షమించండి శాంతా. నేనువెళతాను'

బాధగా కళ్లెత్తి చూసింది శాంత. 'అబ్బే...లేదు' అనబోయి ఆగిపోయింది. నిట్టూరుస్తూ లేచి నిలబడింది.

'మీరు నన్ను అపార్థం చేసుకోకండి మధూ. ఈ క్షణంవరకూ మీకంటె ఆప్తులూ సన్నిహితులూ నా కెవరూ లేరు. మానసికంగా శారీరకంగా ఎంత బాధ పడుతున్నానో మీకు చెప్పుకుని గుండెలలో బరువు తగ్గించుకోవాలనే నాకూ వుంది. కానీ... చెప్పలేకపోతున్నాను. నేను సుఖ సంతోషాలలో బ్రతకాలనే మీ ఆవేదన, ఆరాటం నా కర్థమయ్యింది. కాని నేనేమీ చెయ్యలేను...నా బ్రతుక్కి అవి అంద కుండాపోయాయి. నేను సుఖపడాలి అంటే మృత్యుదేవత ఒక్కటే నన్ను కరుణించాలి' కన్నీటి తెరల మధ్య గద్గదిక మవుతున్న స్వరాన్ని అదుపులో పెట్టుకోవాలని ప్రయత్నిస్తూ అంది.

బాధగా చూస్తున్న అతని ముఖంలోకి ఒక క్షణంపాటు చూసి సెలవు తీసుకుని వచ్చేసింది.

యింట్లో కాలు పెట్టగానే ఎప్పటిలా రాజారావు నిలదీసి అడగలేదు ఎక్కడికి వెళ్లావని. శాంత చెప్పనూ లేదు, మౌనంగా లోపలికి వెళ్లి వంట మొదలుపెట్టింది.

ఆలస్యం అయినందుకు సమాధానం చెప్పుకోని శాంత నిర్లక్ష్యాన్ని అతను సహించలేకపోయాడు. కోపంగా లోపలికి వెళ్లి అడిగాడు. 'ఎక్కడికి వెళ్లావు'అని.

'ఫ్రెండ్ కనబడితే హోటలుకివెళ్లాను' ఏదయితే అదయిందన్న నిర్లిప్తతతో జవాబిచ్చింది శాంత.

'ఎవరా ఫ్రెండ్? ఆడదా? మగవాడా?' వేటకారంగా అడిగాడు.

'మగవాడే' అప్రయత్నంగా అనేసింది.

ఆ ఇంట్లో సర్వసాధారణంగా జరిగే తంతే అప్పుడూ జరిగింది. కానీ యింకో విచిత్రం కూడా జరిగింది. జుట్టు ఊడ్చి క్రింద పడేసి తన్నుతున్న అతని కాళ్లు బలంగా పట్టుకుని 'నేను మీ భార్యని బానిసని కాదు' అంది శాంత.

రాజారావు బాదటం మాని విచిత్రంగా చూశాడు. 'భార్యవని చాలా తొందరగా తెలిసిందే' అన్నాడు వ్యంగ్యంగా.

'బానిస అయినా ప్రాణం వుంటుందన్న నిజం తెలుసు యజమానికి. మీదృష్టిలో నేను ఒక మరబొమ్మని. ఉద్యోగంచేసి నెలనెలా డబ్బు సంపాదించి పెట్టాలి. మీ అనుమానాలకి బలి అవుతూ కిమ్మన కూడదు. ఉద్యోగం మానివేసి యిల్లు కదలకుండా ఇంట్లోనే పడివుంటానంటే అందుకూ వప్పుకోరు. మీ పనులన్నీ చేసి పెట్టే మీ అవసరాలని తీర్చే యంత్రాన్ని. భార్యని అనే భావం, గౌరము, ఆదరణా వుంటే మీ రింత అమానుషంగా ప్రవర్తించరు'

'నోరు మూస్తావా లేదా?' చెయ్యి ఎత్తి మీదకి వస్తూ అడిగాడు రాజారావు.

ముఖంమీద పడుతున్న జుత్తుని వెనక్కి తోసేసుకుంటూ తల ఎత్తి చూసింది శాంత. ఆ కళ్లల్లో ఏదో మొండితనం.

'ఏం చేస్తారు? చెయ్యి నొప్పి పుట్టే వరకూ బాదుతారు. యింకా కోపం పోక పోతే ప్రాణాలు తీస్తారు. అంతేకదా? రోజూ చచ్చేకంటే ఒక్కసారి చావటమే నయం. నన్ను చంపినా మిమ్మల్ని నిలదీసి అడిగేవారు ఎవరూ లేరు. మీమీద హత్యా నేరం రాకుండా యిందులో మీ తప్పేమీ లేదని రాస్తాను. లేదా వాఙ్మూలం యిస్తాను. కానివ్వండి'

రాజారావు ఆగ్రహం ఆశ్చర్యంగా మారింది. గిరుక్కున తిరిగివెళ్లిపోయాడు. మరు క్షణంలోనే బట్టలు తొడుక్కుని విసురుగా బయటి తలుపులు తన్ని వెళ్లిపోయాడు.

శాంత ఆలోచనలనుండి తేరుకునిచూసే సరికి పాలు విరిగి జున్నులా అయ్యి మాడు వాసన వస్తోంది. పాలు పొంగటంవల్లనేమో స్టౌమీద మరకలు కనిపించాయి.

వాటి వైపుచూసి నిట్టూరుస్తూ పాలు దించి స్టౌ ఆర్పేసింది. టైమ్ చూసింది. పదిన్నర అయ్యింది. నెమ్మదిగా లేచి చాప వేసుకుని పడుకుంది.

యిరుగూ పొరుగూ తన వైపు చూసే చూపులని ఎదుర్కోలేక తల వంచేసుకుని



కొల్లిపోతుంది తను. కొద్దిగా అవకాశం దొరికితేచాలు. ఎంతో సానుభూతిగా తన మంచితనాన్ని పొగుడుతూ రాజారావుని తిడతారు.

ఆఫీసులో తమిద్దరి గురించీ చాలా మందికి తెలుసు. ఏనాడు పెదవి కదిపి తనెవరికీ చెప్పకుని ఎరుగదు. వాళ్ళందరికీ ఎలా తెలుస్తాయో అర్థంకాని సమస్య తనకి. ఎంతో జాలిగా చూస్తారు కొందరు. మరికొంతమంది హేళనా సానుభూతి మిళితంచేస్తూ 'ఎందుకొచ్చిన బాధయిది. శారదలా విడాకులిచ్చి హాయిగా బ్రతకక?' అంటారు తను వినేలా.

శారద ప్రక్క ఆఫీసులో పనిచేస్తోంది. బాగానే వున్న వాళ్ళమ్మాయి. ఆఫీసరు భార్య. అతని ప్రవర్తన నచ్చక వదిలేసి వచ్చిందని చెప్పకుంటారు. కన్న తల్లి తండ్రి దగ్గరకూడా వుండటం యిష్టం లేక హాస్టలులో వుంటోంది. అతను వేరే పెళ్లి చేసుకున్నాడు. పిల్లలు కూడా పుట్టారనీ, త్వరలో శారదకూడా యింకా ఎవరినో చేసుకోబోతోందని ఎవరో అను కుంటూవుండగా వింది తను.

'నీకు పిల్లలు పుట్టరు. గొడ్రాలివి నువ్వు. నీకు విడాకులు యిచ్చినేరే పెళ్లి చేసుకుంటాను' రాజారావు బెదిరింపులు గుర్తుకు వచ్చాయి శాంతకి.

అదోలా నవ్వుకుంది. భర్తమీద తనకి ఏమాత్రం ప్రేమానురాగాలులేవు. అయినా అతన్నికొలుస్తూ అతని నీడలోనే బ్రతుకుతోంది. ఏమిటీ ఈ జీవితానికి అర్థం?

ఆలోచనల మధ్య అలిసిపోయి ఎప్పుడు నిద్రపోయింది.

బయట తలుపులమీద దబదబా బాదిన శబ్దం కావటంతో ఉలిక్కిపడి లేచింది. ఒళ్లంతా నొప్పులతో బరువుగా అని పించింది. ఆకలి నీరసం అన్నీ కలిసి జ్వరం వచ్చినట్టుంది. బయట మోత ఎక్కువ కావటంతో విసుక్కుంటూ లేచి తలుపు తీసింది.

గోపాలం లోపలికి వచ్చాడు. అతన్ని చూసి ఆశ్చర్యపోయింది శాంత. 'ఆయన లేరు' అంది విభ్రమత్తుతో కొద్దిగా బొంగురుపోయిన స్వరంతో.

గోపాలం జాలిగా చూసాడు ఆమెవైపు 'రాజాకి హార్ట్ ఎటాక్ వచ్చింది. హాస్పిట లులో వున్నాడు. మీరు వెంటనే బయలు



దేరి రావాలి.'

శాంత అయోమయంగా చూసింది. 'ఆయనకి హార్ట్ ఎటాకు రావటం ఏమిటి?' అర్థం కానట్టు చూస్తున్న శాంతనిచూసి బాధగా నిట్టూర్చాడు అతను.

'సరదాగా పేకాట వేసుకుని కూర్చు న్నాం. ఒక అరగంట క్రితమే ఆట మధ్యలో నొప్పి అంటూ కుడిచేత్తో గుండెలు పట్టుకుని ప్రక్కకి ఒరిగి పోయాడు. వెంటనే ఆ హాస్పిటలుకి తీసికొనివెళ్ళాం...'

శాంత వెర్రిగా అతన్నిచూస్తూ నిలబడి పోయింది.

'మీవాళ్ళెవరి అడ్రసులయినాయిస్తారా? టెలిగ్రాం యిస్తాను...' అతను చెబు తున్నదేమిటో వినిపించుకోలేదు.

'ఏ ఆస్పత్రిలో వున్నారు? నాకు చూపించండి' నిద్రలో నడుస్తున్న దానిలా యింటి తలుపులయినా వేయకుండా బయ టకి నడిచింది.

దరిదాపుల్లో రిక్షాలు కానీ టాక్సీలు కానీ లేవు. రోడ్లన్నీ నిర్మానుష్యంగా వున్నాయి. వీధి దీపాలు మాత్రం కొన ఊపిరితో కొట్టుకొంటున్న ప్రాణుల్లా నీరసంగా వెలుగుతున్నాయి.

పరుగులాంటి నడకతో వేగంగా నడు స్తున్న శాంతని చూసి చివరికి సంకో చిస్తూనే నెమ్మదిగా చెప్పాడు గోపాలం.

'మీరు ధైర్యంగా ఉండాలి. వెళ్లగానే షాక్ అవుతుందేమోనని చెబుతున్నాను. రాజా నేను వచ్చేముందే కళ్ళు మూసాడు'

శాంత నడవటం మరిచిపోయి నిలబడి పోయింది.

'మీరు ధైర్యం తెచ్చుకోవాలి. ఆస్పత్రి దగ్గర కొచ్చేసాం'

శాంత కదలలేదు. వెర్రిగా ఎక్కడో శూన్యంలోకి చూస్తోంది.

'ఈ సందులో ఒక ఇరానీ హోటు లుంది. రిక్షాలేమయినా వున్నాయేమో చూసివస్తాను. మీరిక్కడే వుండండి' శాంత షాక్‌నుండి తేరుకొని నడవలేదేమో అని సైకిలుమీద వేగంగా ప్రక్క సందు లోకి వెళ్ళాడు గోపాలం.

దయాదాక్షిణ్యాలు వున్న విశాల హృద యంలా పరుచుకొనివుంది నల్లని తారు రోడ్డు. రోడ్డు కిరువైపులా వున్న చింత తంగేడు చెట్లు జాలిగా చూస్తున్నాయి.

గుండెలతో మండుతున్న వేదనలా దూరంగా రెండు పెద్ద పెద్ద లైట్లు కనిపించాయి.

ఏదో భావావేశంలో కదిలిపోతూ వున్న శాంత తన అందమైన కళ్ళని పెద్దవి చేసుకొని అటే చూస్తోంది. పలుచగా లేత గులాబీ రంగులా అతి సుకుమారంగా వుండే పెదిమలు కొద్దిగా కదిలాయి. పెళ్ళయిన సంవత్సరంనుండే అందంగా అలంకరించుకోవటం మానివేసిన శాంత ఆ క్షణంలో ఎంతో విచిత్రంగా వుంది. గాలికి ఎగురుతున్న వెంట్రుకలు నుదురు మీద వ్రాలి కుంకుమ బొట్టుని మరుగు పరుస్తున్నాయి.

వేగంగా ఆ లైట్లు దగ్గరికి పరిగెత్తు కొని వస్తున్నాయి. బాగా దగ్గరికి వచ్చే వరకూ చూస్తూ నిలబడిన శాంత గబ గబా రోడ్డుకి అడ్డంగా నడిచింది. కాదు పరిగెత్తింది.

గోపాలం ఖాళీ రిక్షా తీసుకొని సైకిలు మీద వస్తూనే శాంతకోసం నలువైపులా కలయజూసాడు.

తెల్లబోతూ వీధిలైట్లు అటే చూస్తు న్నాయి. వాటి కాంతిలో శాంత రక్తపు మడుగులో పడివుండటం, దూరాన ఫుల్ లోడ్‌లో వున్న లారీ వేగంగా దూసుకుని పోవటం చూసి నిశ్చేష్టుడై నిలబడి పోయాడు.

జరిగిందేమిటో అర్థం కానట్టు చూస్తూ నిలబడిపోయింది తంగేడుచెట్టు. చింతచెట్టు దీర్ఘంగా నిట్టూరుస్తూ కొద్దిగా తల కదిలించింది సానుభూతి సూచనగా.

కాలం చాలా మామూలుగా జరిగి పోయింది. ●



# విప్లవాత్మకమైన జానపద చిత్రం రణభేరి

రాజకీయ సంచలనాన్ని, ఒక రకమైన సామాజిక సిద్ధాంతాన్ని వినోదాత్మకమైన జానపదంలో నింపి చలనచిత్రరంగాన్ని కొత్త పుంతలు తొక్కిస్తూ మోగించిన భేరి 'రణభేరి'. మూర్తీభవించిన మాతృప్రేమ, సోదరుని భక్తితాత్పర్యాల వృత్తాంతం రణభేరి మోతలో ఐక్యమై కొత్త ఉద్యమానికి నాందీ వాచకం పలికింది!

ఏ అన్న జ్ఞాపకార్థమయితే జగద్విఖ్యాతమయిన కట్టడాన్ని నిర్మించాలని చూస్తాడో, ఆ అన్నతోనే (చిన్నప్పుడే తప్పిపోయిన వాడవడంవల్ల తెలియక) వయిరం పెంచుకున్న అన్నదమ్ముల కథ రణభేరి. ఒకవైపున కట్టడాన్ని వ్యతిరేకిస్తూ ప్రజల్ని కూడగట్టి విప్లవాన్ని లేవదీసిన అన్న, మరోవైపున అన్నగారిమీద అవ్యాజమైన అనురాగాన్ని ప్రదర్శించుకోడానికి ఎన్ని కష్టనష్టాలకయినా వెనుకాడని తమ్ముడూ— ఇది కథావస్తువు. బంగారంలాంటి కథావస్తువుతో మరో రెండు ఆభరణాలు సవతి తమ్ముడు కథ, బావమరది కథని జోడించడం జరిగింది కాని, అవి స్వయంప్రకాశాలుగాగాని, పరప్రకాశోపజీవులుగాగాని రాణించలేకపోయాయి. ఈ లోటు ప్రేక్షకుల మనస్సుని కొట్టు వేస్తుందనిచెప్పి సన్నివేశాలకి బంగారపు ములామా చేయడానికి ప్రయత్నం జరిగింది. ఒక ప్రయత్నం ఫలించింది. సవతి తమ్ముడి కథ చిత్రాంతంలో ప్రేక్షకుల్ని చకితుల్ని చేయకమానదు. అన్నదమ్ముల పోరాటంలో సహజత్వం, సవతి తమ్ముడు, మరణ చావు ప్రేక్షకుల మనస్సులో తిష్ట వేసుకుంటాయి.

కత్తి యుద్ధాలు, మరో ప్రపంచం సృష్టి, స్ఫురింపచేసిన జ్యోతిలక్ష్మి శృంగార నృత్యం, ముఖ్య బూతం కల్పన ఇవి కథావస్తువుకి అలంకారాలు. ప్రేక్షకులకి విశేషార్షణ !



'రణభేరి'లో వాణిశ్రీ.

చిత్రం పద్ధెనిమిది రీళ్లుగానూ అనకపోవడానికి కారణం స్క్రీన్‌ప్లేలోని చాతుర్యం. చిత్రీకరణలో దర్శకుడు తీసుకున్న జాగ్రత్తలు చిత్రాన్ని వేగపూరితం చేశాయి. ఈ వేగం ప్రేక్షకుల్ని ఆకట్టుకోడానికి చాల సహాయపడుతుంది.

కథని అనేకవిషయాలమీద పంచకుండా చిత్రాన్ని ఇతివృత్తంమీద కేంద్రీకరించి వుంటే ఢోకాలేకుండా జయభేరి మోగించి వుండేది. హాస్యం కొన్ని తరహాలవారిని మాత్రమే ఆకర్షిస్తుంది. నిడివి తగ్గించడానికి చిత్రంలోచాలాఅవకాశాలుకనిపిస్తాయి.

కథ, చిత్రీకరణలోని నేర్పు ప్రేక్షకుల్ని అబ్బురపరుస్తాయి గనక—ఎందరో నటీనటుల్ని అందులో చిక్కుకుపోవడంతో వెలుగులోకి వచ్చేవారు కొందరు మాత్రమే. అందులో వాణిశ్రీ, కాంతారావు, రాజ్‌బాబు ముఖ్యులు. వారి తర్వాత చెప్పుకోతగ్గవారు వరుసగా రాజశ్రీ, రామకృష్ణ, రాజనాల, ఏడిద, నిర్మల, గీతాంజలి. పాత్రల అవధులమేరకు నటీనటులంతా పకడ్బందీగా సామర్థ్యంతో నటించారు.

భేరీ అక్కడక్కడ రణగొణ ధ్వని చేసినా, చిత్రీకరణలో ఘన విజయాన్ని సాధించిన 'రణభేరి' చిత్రానికి స్క్రీన్‌ప్లే, దర్శకత్వం గిడుతూరి సూర్యం నిర్వహించారు. చక్కని సెంటిమెంటుని రణభేరిలో రంగరించి రసవత్తర శబ్దతరంగాల్ని వెలికి తెప్పించిన కథారచయిత బొమ్మకంటి సుబ్బారావు. మాటలు మహారథి రాశాడు. సంగీతం కోదండపాణి కూర్చారు. నిర్మాత పింజల సుబ్బారావు.

—సిరరాజు

అవీ-ఇవీ ...

## వివాహం

శ్రీమతి, శ్రీ సి. ఎల్. నాయుడు, సౌండ్ ఇంజనీర్, విజయవాడ జ్యేష్ఠపుత్రిక చి. సౌ. అనూరాధకి, కొలంబో వాస్తవ్యులైన డాక్టర్ సుందరం తృతీయ పుత్రుడైన చి. మురళీసుందరానికి ఫిబ్రవరి 3వతేదీనాటి రాత్రి తిరువాయూరులోని తిరుమల తిరుపతి దేవస్థానపు వివాహ సత్రంలో వైభవంగా వివాహం జరిగింది.



'తల్లిప్రేమ'లో కాంచన, సావిత్రి

# సినిమా

### మూడు చిత్రాలు

ఫిబ్రవరి 5న మూడు కొత్త చిత్రాలు ప్రారంభింపబడ్డాయి. ఈ మూడు చిత్రాల్లోనూ రాజనాల నటిస్తున్నారు. రెండింటిలో కాంతారావు, సత్యనారాయణ నటిస్తున్నారు. నాయికగా రాజశ్రీ రెండు చిత్రాల్లో వేషం ధరిస్తూంది. మూడు చిత్రాలకు ఫిబ్రవరి 5 న ఉదయం 8–9 గంటల మధ్య ప్రారంభ పూజ జరిగింది. ఈ చిత్రాలను నిర్మించే సంస్థలు చిన్ని బ్రదర్స్, నవజ్యోతి పిక్చర్స్, రాజు పిక్చర్స్. శ్రీ వేదాంతం రాఘవయ్య, తాతినేని రామారావు, సుబ్బరామదాస్ పై చిత్రాలను వరుసగా డైరెక్టు చేస్తున్నారు. చిన్ని బ్రదర్స్ నిర్మించే 'కుంకుమ భరిణె'లో మొదటి షాట్ అంజలీదేవి, శోభన్‌బాబులపై చిత్రీకరణ జరిగింది. నవజ్యోతిలో కాంచన, సత్యనారాయణ, రాజనాల, మొదటిరోజు షూటింగులో పాల్గొన్నారు. రాజు పిక్చర్స్‌లో కాంతారావుపై మొదటి షాట్ తియ్యడం జరిగింది. ఈ మూడు చిత్రాలను శరవేగంగా నిర్మించాలని నిర్మాతలు అభిప్రాయ పడుతున్నారు.

### పద్మశ్రీలకి సన్మానాలు

హైదరాబాదు రవీంద్ర భారతిలో 'పద్మశ్రీ' నాగేశ్వరరావుకు 30 కళాశాలల విద్యార్థులు పెద్ద ఎత్తున సన్మానం చేశారు. శ్రీ నీలం సంజీవరెడ్డి అధ్యక్షత వహించారు.

మద్రాసులో 'పద్మశ్రీ' రామారావుకు శ్రీ బి. నాగిరెడ్డి అధ్యక్షతన 21 మంది నిర్మాతలు చేరి 'ఉడ్‌ల్యాండ్స్ హోటలు'లో ఘనంగా సత్కరించారు.

* * *

'ఫిబ్రవరి 23 న 'తల్లి ప్రేమ'ను విడుదల చేస్తామనుకున్నాను; కాని కొంత డబ్బింగ్ వర్కు మిగిలి పోవడంవల్ల, మార్చిలో రిలీజు చేస్తామనుకుంటున్నా' అన్నారు ఆజం ఆర్ట్సు అధినేత. ఫిబ్రవరి 2 న 'తల్లి ప్రేమ'కు సంబంధించిన ఆఖరు పాట రికార్డింగ్ విజయగార్డెన్స్‌లో జరిగింది. పద్మనాభానికి పిఠాపురం నాగేశ్వరరావు, గీతాంజలికి ఎల్. ఆర్. ఈశ్వరి పాడిన పాట సాహిత్యాన్ని శ్రీ కొసరాజు చక్కగా వ్రాసారు. ఆ పాటలోని కొంత భాగాన్ని మీరూ చదవండి, సినిమాలో విని ఆనందించండి.

'వద్దురా...వేరుగ వుంటాం

వద్దురా' అని పద్మనాభం, గీతాంజలి కలిసి పాడారు (తెరపైన) శ్రీ సుదర్శనం యీ పాటకు హిందూస్తానీ రాగాన్ని వినిపించారు. శ్రీకాంత్ దర్శకత్వంలో పద్మశ్రీ రామారావు, సావిత్రి, రాంమోహన్, కాంచన, పద్మనాభం, గీతాంజలి, నాగభూషణం, రేలంగి, ఛాయాదేవి, కె.వి. చలం ముఖ్య పాత్రలను పోషించారు.



'మూగజీవులు'లో ప్రసన్నలక్ష్మి.

### వింత గొంతు

గార్డెన్స్ నుండి వాహినీ స్టుడియోకి వెళ్లాను. అక్కడ సురేష్ 'పాపకోసం' షూటింగు జోరుగా జరుగుతూవుండింది. కానిస్టేబులుగా పద్మనాభం ఒక వింత స్వరంలో ప్రేక్షకుల్ని కడుపుబ్బ నవ్విస్తారు. అన్నట్టు మరిచా! మొన్న హైదరాబాదులో పద్మశ్రీ 'వింత కాపురం'లో పద్మనాభం ఆడవేషం వేసుకుని సెట్టులోకి వెళ్తే యెవ్వరూ గుర్తుపట్టలేక పోయారట !

### నాలుగు రాగాల మేళవింపు

వాహినీలో చిన్ని బ్రదర్స్ సహాయ దర్శకుడు శేఖర్ కన్పడి 3 వ తేది మా రికార్డింగ్ వుంది, రండి అని పిలిచారు. సరేనని వెళ్లాను. లోపల ప్రవేశించానో, లేదో తియ్యటి రసస్పందన కల్గించే ట్యూను విన్పడింది. ఆ ట్యూనుకు పి.బి. శ్రీనివాస్ తన బేస్ వాయిస్‌ను చక్కటి సంగతులలో మధురంగా ఆలాపించారు. శ్రీ నారాయణరెడ్డి వ్రాసిన పాటకు ఆదినారాయణరావు మోహన, కానడ, బింప్లాస్, కళ్యాణి రాగాలను మేళవించి శరీరాలను మైమరిపించే విధంగా సర్వం వేసారు.

నయా జమీనా.. గయా పురానా

రాట్నం వడికే రోజులు పోయాయి.



'దోపిడిదొంగలు'లో జయలలిత.



లక్ష్మీనివాసం'లో రామ్మోహన్, భారతి.

రాకెట్ యుగమోయీ!' అని ప్రారంభయ్యే యీ పాటలో నేటి నాగరకతా ప్రపంచంలో జరిగే సంఘటనల్ని చమత్కరించారు. శోభన్‌బాబుపై యీపాట చిత్రీకరింపబడుతుంది. ముఖ్య పాత్రలను కాంతారావు, రంగారావు, అంజలి శోభన్‌బాబు, రాజశ్రీ, పద్మనాభం, గీతాంజలి పోషిస్తారు.

* * *

రికార్డింగ్‌కు వచ్చిన అంజలీదేవిని ఏమిటమ్మా, 'క్షేత్రయ్య' ప్రారంభించలేదా? అన్నాను. 'మన తెలుగు సంవత్సరాదికి మొదలు పెడ్తామనుకున్నాం. అంతవరకు ఖాళీగా వుండడం దేనికని 'కుంకుమ బరిణె'ను స్టార్ట్ చేసాం' అన్నది.

## నాటికీ నేటికీ మార్పులేదు

శ్రీమతి అంజలీదేవి అణకువకు అతిథి మర్యాదకి పెట్టింది పేరు, నాటినుండి నేటివరకు 'అహం' అనే పదాన్ని వేర్చుకోలేకపోయింది. మంచితనానికి తను ఒక ప్రతిబింబంలాగా అందరిచే ప్రశంసింపబడ్తావుంది! 'మాయలమారి'లో యెంత అందంగా అగుపించిందో, తల్లి వేషాలు వేస్తున్న యీ రోజుల్లో కూడా అలాగే కన్పిస్తూవుంది.

* * *

శ్రీమతి జయంతి, కాంచన, రాజశ్రీ, గీతాంజలి ఆప్తమిత్రులు. వీళ్ళు ఒకరి నొకరు గిచ్చుకోవడం, తిట్టుకోవడం తమాషాగా వుంటుంది. ఒకావిడ మరొకరి జడను లాగితే, మరియొక నటి యింకొకరి వీపుపై బాదుతుంది. ఈవిధంగా యీ నల్గురూ చేరితే టైం సంగతే గుర్తుకురాదు.

## 'నిమిత్త మాత్రులమే'

నేను 15 తమిళ చిత్రాల్లో నాయికగా నటిస్తున్నా; అంతేకాదు-ప్రముఖ నాయకులతోనే మంచి వేషాలు వేస్తున్నా; కానీ మనవాళ్ళు యింకా 'వ్యాంప్.రోల్స్‌ను వెయ్యమంటున్నారు వెయ్యకూడదనే పట్టుదల లేదనుకోండి. కానీ తీరిక దొరకాలికదా—ఏమిటో యెంత మంచిగావున్నా, ఒక్కోసారి యెవరికయినా మనం కాకుండా పోతామా అనిపిస్తుంది. అంతా భగవంతుడి లీల; మనం కేవలం నిమిత్తమాత్రులమే. అని వేదాంతాన్ని వల్లించేసింది వాణిశ్రీ.

## అభిమాన పాత్రమైన భూమిక

ప్రముఖ హాస్యనటుడు శ్రీ పద్మనాభం నిర్మించే 'శ్రీరామకథ' చిత్రం యొక్క రికార్డింగ్ మార్చి 1 న జరుగుతుంది; తప్పక రమ్మన్నారు పద్మనాభం సురేష్ సెట్టులో. రెండుపాటలు కంపోజ్ చెయ్యబడ్డాయి. శ్రీ సముద్రాల రాఘవాచార్య వ్రాసారు. పద్మనాభం దర్శకత్వం వహించే మొదటి చిత్రం యిది. తనకు అభిమాన పాత్రమయిన 'నారద' భూమికను పద్మనాభం యిందులో ధరిస్తున్నారు. 1968 జనవరినుండి డిసెంబర్ వరకు నెలకు 25 రోజులు షూటింగు వుందంటీ అన్నారు. ఈ వివరాన్నిబట్టి ఆయన యెన్ని చిత్రాల్లో నటిస్తున్నారో పాఠకులే నిర్ణయించుకోండి.

## ఈత కొలనులో తన్మయత్వం

'హైదరాబాదు సారథిలో ఆరురీళ్ళ చిత్రం తయారైంది అన్నారు. 'వింత కాపురం' నిర్మాత వి వెంకటేశ్వర్లు. ఫిబ్రవరి 7 న అడయార్‌లోని 'స్విమ్మింగ్ పూల్'లో కృష్ణ, కాంచన జలకాలాడుతూ తన్మయత్వంలో పాడేపాటను దాశరథి యీవిధంగా వ్రాసారు.

చూపుల్లోనే కోపం!
లోపల ఎంతో తాపం;
అయ్యయ్యో పాపం'

శ్రీ వేణు సంగీత సారధ్యంలో ఘంటసాల సుశీల పాడిన యీ పాటకు, కృష్ణ, కాంచనలు తమ ఉచ్ఛ్వాస, నిశ్వాసలను వదులుతూ తన్మయత్వాన్ని అనుభ



'బ్రహ్మచారి'లో నాగేశ్వరరావు, జయలలిత.

విస్తూ వుండే దృశ్యాన్ని తెరపై మీరు చూచి పరమానందభరితులు కాకమానరు. కొత్త దర్శకుడయిన అబ్బి యీ ప్రేమ గీతాన్ని అందంగా పిక్చరైజ్ చేసారు.

**20 రోజులు మదరాసు**

**10 రోజులు హైదరాబాదు**

'స్విమ్మింగ్ పూల్'లో చాలాసేపు వుండడం మూలాన గొంతుపోయిందండీ; అన్నది కాంచన, స్విమ్మింగ్ డ్రెస్‌లో కాంచనను చూసినప్పుడు, యీమె సౌందర్యాన్ని చూచి యే యక్షుడూ ఈర్ష్య పడకుండా అనిపించింది. కాంచనను 'గ్లామర్ గర్ల్ ఆఫ్ ది డే' అని అనడంలో అతిశయోక్తి వుండదేమో! ప్రస్తుతం 15 చిత్రాల్లో కథానాయికగా నటిస్తున్నట్లు వెల్లడించింది. 'నెలకు 20 రోజులు మద్రాసు షూటింగు; పది రోజులు హైదరాబాదులో షూటింగ్' అన్నది కాంచన.

*　*　*

సత్యనారాయణ బలిష్ఠుడు, ప్రతిభావంతుడు, ప్రతి ఎదిరిని సునాయాసంగా

## సినిమా

పడగొట్టగలవాడు. కానీ, కాంతారావు దగ్గర యీయన పప్పులేమీ వుడకలేదు. పాపం, కాంతారావు దెబ్బలకు తట్టుకోలేకపోయాడు వీళ్ళిద్దరూ ప్రాణస్నేహితులు గదా, మరి వీళ్ళెందుకు కొట్లాడుకున్నారు? అని మీరు ప్రశ్న వేస్తారని నాకు తెలుసు. ఈ సంఘటన నిజ జీవితంలోది కాదు. రాజు పిక్చర్స్ నిర్మించే జానపద చిత్రం లోని ఈ చిత్రంయొక్క కథను వేటూరి చాల చక్కగా వ్రాశారు. సుబ్బరామదాస్ డైరెక్టు చేస్తున్నారు. రాజనాల అంటే విలన్ అని అందరూ భ్రమిస్తారు. ఈ చిత్రంలో రాజనాల విలన్ కాదు — కాంతారావుకు తండ్రిగా నటిస్తున్నారు.

*　*　*

యువ గాయకుడు బాలసుబ్రహ్మణ్యం తన గాన మాధుర్యంతో సంగీత దర్శకులందర్ని మెప్పిస్తున్నాడు ఇంత చిన్న వయస్సులోనే ప్రముఖ నేపథ్య గాయకులలో ఒకడుగా గుర్తింప బడ్డాడు. ప్రస్తుతం ఘంటసాలకు తర్వాత యెవరయ్యా అంటే — బాలసుబ్రహ్మణ్యమేనని ప్రతి నిర్మాత చెప్తూ వుండడం విని ఒకరోజు రికార్డింగ్‌కు వెళ్ళాను. వాళ్ళు చెప్పింది అక్షరాలా నిజం అనిపించింది. ఇప్పుడు తెలుగులోనే గాక తమిళం, కన్నడం చిత్రాల్లో కూడ యీ కుర్రవాడు పాడుతున్నాడు.

*　*　*



'నిలువు దోపిడీ'లో జయలలిత.

## సినిమా డైరీ

- శ్రీమతి జమున నటించిన నూతన చిత్రం గౌరీ ప్రొడక్షన్స్ వారి "పాలమనసులు"
- గీతాంజలి పేరిట విజయవాడలో 'గీతా కళా సమితి' అనెడి సాంస్కృతిక సమితిని ఒక అభిమాని స్థాపించి వున్నాడు.
- వాహిని నిర్మించే "బంగారు పంజరం"లో వాణిశ్రీ, శోభన్‌బాబులు నాయికా, నాయకులుగా నటిస్తారు.
- పి. ఎస్. ఆర్. పిక్చర్స్ "రణభేరి" ఫిబ్రవరి 9వ తేదీన విడుదలయింది.
- శ్రీజ్యోతిఫిలింస్ నిర్మిస్తున్న తమిళ చిత్రంలో బాలాజీ భార్యగా గీతాంజలి నటిస్తుంది.
- జయప్రొడక్షన్స్ యొక్క షూటింగు ఫిబ్రవరి 9న నీనస్ స్టూడియోలో ప్రారంభమైంది అమంచర్ల దర్శకత్వంలో నిర్మించబడుతున్న యీ జానపదచిత్రాన్ని జిల్లాలవారీగా విడుదల చెయ్యాలని నిర్మాత అప్పారావు తెల్పారు.
- కుమారి జయలలిత, ఎం. జి. రామచంద్రన్ లు ట్రేవల వాహిని స్టూడియోలో ఆరుగంటల సేపు 'వానసీను'లో నటించారు.
- తిరువేంద్రంలో హాస్పిటల్ భవన నిర్మాణ సహాయార్థం జానకి, శ్రీనివాస్‌ల గానకచేరీ జరిగింది.
- చిన్నిబ్రదర్స్ "కుంకుమబరిణె"లో రెండు ముఖ్యపాత్రలను కాంతారావు, రాజనాల నటిస్తున్నారు.
- మద్రాసు ప్రాంతీయ సెన్సారు ఆఫీసరుగా శ్రీ బి. ధర్మరాజన్ నియమింపబడ్డారు.
- ప్రపంచ నాట్యసుందరిగా పేరెన్నికగన్న శ్రీమతి పద్మిని సిలాప్రొడక్షన్స్ "ఆధ్యపిక" మళయాల చిత్రంలో నాయికగా నటిస్తూంది.
- ప్రముఖ నేపథ్యగాయకులు శ్రీ టి. ఎం. సౌందరరాజన్, ఎ. ఎల్. రాఘవన్ "కల్లుం కనియాగుం" చిత్రంలో ముఖ్యభూమికల్ని పోషిస్తున్నారు.
- శక్తి ఫిలింస్‌లో ఎ. వి. ఎం. రాజన్, విజయకుమారి మొదటిసారిగా దంపతులుగ నటిస్తున్నారు
- కనకరత్నా మూవీస్‌లో లేనిక నాయికగా నటిస్తూంది.

# మీకు తెలుసా?

ప్రముఖ నటుడు శ్రీ టి. ఎల్. కాంతారావు సినిమాకు పోయినా, సన్మానానికిపోయినా, కనీసం షాపింగ్‌కు పోయినా తన భార్య వెంట రానిదే కదలరు.

దర్శకుడు, నిర్మాత, నటుడు అయిన శ్రీ పద్మనాభంకి తీరిక దొరికినప్పుడల్లా హ్యాండ్ కెమరాతో స్నాప్‌లు తియ్యడం అలవాటు.

హాస్యనటుడు రామచంద్రరావుకు షూటింగు లేని సమయాల్లో జ్యోతిశ్శాస్త్రం పై కొత్త అంశాలను నేర్చుకోవాలని గంటల తరబడి గ్రంథాల్ని తిరగవెయ్యడం అలవాటు.

గీతాంజలికి కాఫీ తాగిన వెంటనే ఒక చెంబునీళ్ళు తాగడం అలవాటు.

త్యాగరాజు యెప్పుడూ యేదో ఆలోచిస్తూ వుంటారు.

ప్రఖ్యాత విలన్ సత్యనారాయణ వారానికి మూడు ఇంగ్లీషు సినిమాలను తప్పకుండా చూసి తీరుతారు.

రామదాసుకు విరామం దొరికితే యేదేనా కొత్త నాటకాన్ని వ్రాసేందుకు ప్రయత్నిస్తారు.

ప్రముఖ గాయిక కృష్ణకుమారి ఘంటి దగ్గర వుండే రోజుల్లో సాయంకాలంపూట పూందమల్లిలో వుండే గార్డెన్స్‌కు వెళ్తూ వుంటారు.

నేపథ్యగాయకి జానకి తన యింట్లో షటిల్ కాక్ ఆడుకుంటూ వుంటారు.

జనరంజని చిత్రానికిగాను శ్రీమతి ఎస్. జానకి పాడిన జోలపాటను శ్రీ చలపతిరావు వాహిని సౌండు థియేటర్లో రికార్డు చేసారు. శ్రీ శివరాం శబ్దగ్రాహ్యంలో ఈ కార్యక్రమం జరిగింది. ఈ పాటను దాశరథి యింపైన సొంపు గుబాళించే రీతిలో వ్రాసారు. ఆ పాటలోని పల్లవి క్రింది విధంగా వుంటుంది.

‘మల్లెలుకన్నా జాబిలికన్నా



‘సుఖదుఃఖాలు’లో వాణిశ్రీ.

చల్లని పాపాయి

లాలిజో, రావోయి’

ఈ చిత్రంయొక్క షూటింగు మార్చిలో ప్రారంభమవుతుంది. శ్రీమతి జమున—హరనాథ్ మరలా ప్రేమికులుగా నటిస్తున్నారు. వీరి జంటను ప్రేక్షకులు బాగా ఆదరిస్తున్నారు. శ్రీ తాతినేని రామారావు డైరెక్టు చేస్తున్నారు.

**‘మార్చిలో విడుదల చెయ్యాలనుకుంటున్నాం’**

‘ఇన్‌డోర్ వర్కు పూర్తయింది’అన్నారు ‘దేవకన్య’ నిర్మాత రామరాజు. ‘ఔట్‌డోర్ కూడ ఫిబ్రవరి నెలాఖరుకు పూర్తిచేసి మార్చిలో విడుదలచెయ్యాలనుకుంటున్నాం’ అన్నారు దర్శకులు హేమాంబరధరరావు. కాంచన, కాంతారావు, రాజబాల, త్యాగరాజు, ప్రభాకరరెడ్డి ముఖ్య భూమికల్ని ధరించారు. హాస్యపాత్రని అల్లు రామలింగయ్య, బాలకృష్ణ పోషించారు.

* * *

బాలకృష్ణ అంటే జ్ఞాపకం వచ్చింది. ఇటీవల విడుదలయిన ‘అపోధ్యుడు’లో బాగా నటించాడు. ‘ముందడుగు’ తర్వాత సాంఘికచిత్రంలో యింత మంచివేషం రానందుకు వాపోయాడు. బాలకృష్ణ యెలాంటి పాత్రనయినా సమర్థనీయంగా పోషించగలడు. ‘రణభేరి’లో యాదవుడిగా, ‘అందంకోసం పందెం’లో కింకింశ్రీ భావకవిగా విశిష్టమయిన నటనను ప్రదర్శించాడు.



‘దేవకన్య’లో కాంచన.



'శ్రీ ప్రొడక్షన్స్ చిత్రం'లో చంద్రమోహన్ కాంచన, కృష్ణ

**'మరొకరోజుకి మార్చుకున్నాము'**

'ఫిబ్రవరి 3 వతేది 'అశోక్‌నగర్'లో షూటింగు జరిగివుంటే 'తిక్కశంకరయ్య' పూర్తి అయివుండేది. కానీ అదేరోజు ప్రధాని ఇందిరాగాంధీ మద్రాసు వచ్చినందువల్ల పోలీసు బందోబస్తు దొరకడం దుర్లభమైంది. అందుకే షూటింగును మరొకరోజుకు మార్చుకున్నాము' అన్నారు నిర్మాత శ్రీ డి. వి. ఎస్. రాజు. మార్చిలో విడుదలకానున్న ఈ చిత్రంలో 'పద్మశ్రీ' రామారావుకు కృష్ణకుమారి, జయలలితలు ప్రేయసీలుగా నటించారు. శ్రీ యోగానంద్ డైరెక్టు చేస్తున్నారు.

* * *

రాజ్యం పిక్చర్స్ షూటింగు కార్యక్రమం సక్రమంగా వేసుకున్న షెడ్యూలు ప్రకారం జరిగిపోయింది. ఇందులో నాగేశ్వరరావు ద్విపాత్రాభినయం చేసారు. రాజశ్రీ, భారతి, గుమ్మడి, రేలంగి, సూర్యకాంతం ముఖ్యపాత్రధారులు. శ్రీ సి. ఎస్. రావ్ డైరెక్టుచేసిన ఈ చిత్రాన్ని శ్రీమతి లక్ష్మీరాజ్యం, శ్రీ శ్రీధరరావు నిర్మించారు.

—శ్రీనివాస్

# పద్మశ్రీ రామారావుకి సన్మానం

శ్రీ నందమూరి తారక రామారావుని భారతప్రభుత్వం 'పద్మశ్రీ'గా సత్కరించింది. అభినందిస్తూ ఫిల్మ్ ప్రొడ్యూసర్స్ గిల్డ్ ఆఫ్ సౌత్ ఇండియావారు మద్రాసు వుడ్‌లాండ్స్ హోటల్‌లో ఆయనకి గౌరవ సన్మానసభని ఏర్పాటు చేశారు.

'మా యింట పెరిగిన మురిపాల బిడ్డ రామారావు బహుముఖ ప్రజ్ఞావంతుడై అఖండ గౌరవాన్ని చూరగొన్నాడు. ఇది గర్వకారణం' అన్నారు సభకి అధ్యక్షత వహించిన శ్రీ బి. యన్. రెడ్డి.

శ్రీ యన్. టి. రామారావు అందాన్ని ప్రశంసిస్తూ 'ఆరాధ్యదైవం శ్రీరామచంద్రమూర్తి అభిమాన పుత్రుడు యన్. టి. రామారావు. భగవంతుడు తన నిండు విగ్రహాన్ని మానవులకి ప్రదర్శించడానికి యన్. టి. రామారావు రూపంలో అవతరించాడు.' అని శ్లాఘించారు శ్రీ బి. యన్. రెడ్డి.

'రామారావుగారికి పద్మశ్రీ నిచ్చి ప్రభుత్వం తన్ను తాను గౌరవించుకున్నదని, కళాకారుని గౌరవించడం దేశానికి కీర్తిదాయకమనీ' అన్నారు.

'చలనచిత్రరంగంలోని వ్యక్తి అదే పరిశ్రమకి తనకృషిని, శక్తిని అంకితం చేయడం హర్షదాయకం. అక్షర జ్ఞానంలేని ప్రజలకి



'తిక్కశంకరయ్య'లో రామారావు.

సినిమాలు జ్ఞానబోధ చేయవలసివుంది. చిత్రాలలో వినోదంతోపాటు సభ్యతాసంస్కారాలు కూడా వుండేటట్టు చూడమ'ని ఆయన శ్రీ యన్. టి. ఆర్. కి సూచించారు.

శ్రీయుతులు ఎ. వి. మెయ్యప్పన్. టి. కె. షణ్ముగం, వి. శ్రీనివాసన్, గోవిందరాజులునాయుడు, పేకేటి శివరాం, సి. నారాయణరెడ్డి, రామూ కరియత్, విశాలాచార్య, ఇంటూరి వెంకటేశ్వరరావు, శ్రీ యన్. టి. రామారావుని అభినందించారు. అభినందించిన వారిపై భక్తివిశ్వాసాలు ప్రకటిస్తూ—'నటరత్న, పద్మశ్రీ బిరుదులకంటే ప్రజల ప్రేమవాత్సల్యాలే తమకి ఎక్కువ సంతృప్తిగా వుంటాయని' శ్రీ రామారావు అభిమానులందరికీ, ప్రజలకి కృతజ్ఞతలు తెల్పుకున్నారు.

—ఒ. వి.



'తల్లిప్రేమ'లో కాంచన, రామ్మోహన్

# పుస్తకాలు

## చరిత్రగతుడు

### (కథలసంపుటి)

రచన: శ్రీ ఆకుండి నారాయణమూర్తి క్రౌన్ సైజు 178 పేజీలు వెల: రు 4/– ప్రతులకు: బృందావన్ పబ్లిషింగ్ హౌస్, మారిసుపేట, తెనాలి.

ఈ నాడు కథలకు లోటు లేదు కోకొల్లలుగా వస్తున్నాయి. అయితే ఉత్తమ శ్రేణికి చెందిన కథానికలు కొద్దిపాటే. వ్యూహంలో, కల్పనాశక్తిలో అందెవేసిన ఆరు కథల సంపుటి ఇది.

శిధిలావస్థలో మూడుకాళ్ల బెంచికి నాలుగో కాలుగా ఓ కొంకంచువ సంతరించుకుని పూరిపాకలో ప్రారంభమయిన ఒక హోటేలు. దానితోనే మొదలయిన గణేశయ్యర్ కథ. గణేశయ్యరు కథతో జోడించి సాగిన రాధాకృష్ణన్ గాథ.

కాలం కాస్త ముందుకు వెళ్లింది. హోటేలు దివ్యభవనంగా మారింది. అయ్యరు లక్ష్మీపుత్రుడయ్యాడు. రాధాకృష్ణన్ హోటేలుకు ప్యూనయ్యాడు.

మరికాస్త ముందుకు వెళ్లేటప్పటికి– కథ అడ్డం తిరిగింది. కాలం వక్రించింది. ఏమీ గణేశయ్యరు? ఏమయ్యాడు రాధాకృష్ణన్ — 'చరిత్రగతుడు' కథే సమాధానం.

*　　*　　*

రెండో కథ 'భయం'.

భయంతోనే ప్రారంభం. భయంభయంగానే నడక. చివరికి— భయపడ్డ ప్రాణి తనని అంతగా భయపెట్టిన వ్యక్తిని చూసి అనుకుంటుంది: 'వెధవకి నేనంటే ఎంత భయం!— ' అని. అంటే— భయంలో కూడా అసలు, నకలు, కల్తీ, నిజాయితీ అనే భేదాలు వ్యక్తమవుతున్నాయన్నమాట.

'భయం' చదివిన పాఠకులకూ కూడా అంతో ఇంతో భయం తప్పదు.

ఇంటికి పెద్దకోడలు అన్నపూర్ణ, పాలేరు రామయ్య. ఈ ఇద్దరి గురించిన కథ మూడోది.

'గురించి' అనగానే మరోలా అనుకోకూడదు. విధి తిలకం తుడిచివేసినా, ఆమె మహాఇల్లాలు.

రామయ్య, అన్నపూర్ణ— వీళ్లిద్దరినీ నోటికో విధంగా ఆడిపోసుకున్నారు, లోకులు. అన్నీ భరించింది అన్నపూర్ణ. ఉన్నట్టుండి ఒకనాడు— 'నా కొడుకుపై నాకు గల ప్రేమ ఎంత నిష్కల్మషమైనదో రామయ్యపై నాకు గల ప్రేమ కూడా అంత నిష్కల్మషమైనదే' అని వెల్లడించింది, ఆమె.

ఆ ప్రేమకు కారణం — మరి, రామయ్యను అన్నపూర్ణ ఎందుకు శిక్షించినట్టు?

రామమూర్తి, అనసూయ, ఒక నెక్లెను— మూడే మూడు పాత్రలు.

రామమూర్తి, అనసూయా ఎవరి కేమీ కారు. అయితే, ఇద్దరికీ నెక్లెసుతో సంబంధం ఏర్పడింది. ఈ బంధం కల్పించి నెక్లెసు పోయింది!— రామమూర్తి మనసు క్షాళనమైంది.

మరి, అనసూయ గతి?— నాలుగో కథలో ఉంది జవాబు.

స్త్రీ అయివుండి, అందులోనూ ఆర్థిక దుస్థితిలో ఉండి కూడా తీవ్ర మనోఘాతానికి తట్టుకుని ఎంతో నిర్వికారంగా జీవిస్తున్న అన్నపూర్ణలో మహత్తరమయిన దివ్యశక్తి ఏదో ఉన్నట్టు భావించాడు, విశ్వనాథబాబు. ఏమిటా శక్తి - 'ఆరాధన' కథను అన్వేషిస్తే వెల్లడవుతుంది.

నిర్ఘాంతపోయిన రమణమ్మ బొటబొట కన్నీరు కార్చింది. ఇన్నాళ్లూ తను తమ్ముడి మీద తనకున్నది అభిమానమే తప్ప వాత్సల్యం కాదని గుర్తించింది. తమ్ముడి పట్ల తను మాతృశ్రీగా మసలుకోలేక పోయింది. వాత్సల్యం అంటే ఏమిటి — 'చిట్టిబాబు' కథలో కామాక్షికి తెలుసు.

ఈ సంపుటిలోని కథలు ఒకరూ పోల్చి చెప్పడానికి వీలుగాకుండా, దేనికదే గొప్పగా వున్నాయి. విశిష్టతతో వెలుగొందుతున్నాయి. ఎత్తుకున్న కథావస్తువులూ, కల్పించిన సంఘటనలూ ఎంతైనా ఆసక్తి కల్గిస్తున్నాయి. అటువంటప్పుడు చదువుతున్నంత సేపూ పాఠకుడు కథల్లో లీనమై పోతాడంటే ఆశ్చర్యం లేదు. ఉత్తమ స్థాయిలో శక్తివంతమయిన కథలు అందించగలిగిన ఈ రచయితకు మా అభినందనలు.

— శివకుమారి

## భార్గవానందలహరి

ఖండకావ్యం. రచయిత:— కే. శే. సిరిప్రెగడ భార్గవరావు. 81 పేజీల పుస్తకం రెండురూపాయలు. సాహితీమేఖల, చండూరు, నల్లగొండజిల్లా.

కె. వి. గోపాలరత్నం

# తెలివి తక్కువ తనం ఫలితాలు: మనం నేర్చుకోని గుణపాఠం

'గాడి తప్పకుండ వెళ్లటం 'గాడిద గుణం,' అన్నాడట ఒక బ్రిటిషు ప్రధాని ఎప్పుడో. గత నాలుగు విదేశపర్యటనలలో భరత క్రికెట్ జట్టు వాలకం చూస్తే (1959 ఇంగ్లాండులో 0–5, 1962 వెస్టిండీస్‌తో 0–5, 1967 ఇంగ్లాండుతో 0–3, 1967–68 ఆస్ట్రేలియాతో 0–3) బరువు మోసే ఈ జంతువుతో పోలికలు బయట పడ్డాయనిపిస్తుంది.

ఈ దారుణానికి పాపిని దూషించటం కన్నా పాపాన్నే ఖండించటం మంచిది. ఆటగాళ్ల దుస్థితికి కారకులయిన అధికారులని విచారించాలి. యుద్ధంలో ఓటమికి సేనాధిపతే కదా బాధ్యుడుగా పరిగణిస్తారు! పొరపాటెవరయినా చేస్తారు; పొరపాటునుబట్టి నేర్చుకోవటంలో వేటంది. మన జట్టుని ఎన్నుకునేవారు ఎన్ని పొరపాట్లు చేసినా తమ తత్వాలని, చిన్న ద్వేషాలనీ మార్చుకునేట్లు కనిపించరు. చివరిని మన దేశపు టీమ్ అందరి నవ్వుల పాలూ అయింది. మంచి ఆటగాళ్లని వదిలివెయ్యటంవల్ల ఇంగ్లాండులో మన పరువుపోయింది మొన్న ఆస్ట్రేలియాకి పంపిన జట్టులో జయసింహని వదిలేశారు. తర్వాత అతను బదిలీగావెళ్లి ఆడిన ఆట ఎలా ఉందంటే ఒక విమర్శకుడు అన్నట్లు 'జయసింహ కొట్టిన ఒక్కొక్క దెబ్బ ఎన్నికదారుల గుండెలలో పోటు' అయి ఉండాలి. ఎన్నిక చేసిన వారిమీద ఇదొక విశ్వాసరహిత చర్య' అనవచ్చు.

ఏ జట్టుకయినా 'వేగం' అనే వయిటమిన్ ఉండాలి. వేగంగా బవుల్ చేసే ఆటగాడు లేకపోతే ఏమవుతుందో మనవారు చూస్తూనేఉన్నారు కొంతకాలంగా. జట్టుని ఎన్నుకున్నప్పుడు అది ఎన్నికో, కలగాపులగమో చూడకుండా చేస్తున్నారు అధికారులు. ఒక్కొక్క ఆటగాడు ఉజ్వలంగా ఆడి ప్రయోజనంలేదు. మొన్న 80 విక్కెట్లకి 2082 పరుగులు చేశారు మన ఆటగాళ్లు—అందులో జయసింహమాత్రం వందపయిన వేశాడు. (2082 లో 11 మంది సున్నాలుకూడా వేశారు.) మెల్బర్న్‌లో 25 పరుగులకే 5 వికెట్లు పడ్డాయి, బ్రిస్‌బెన్‌లో 9 కి మూడు పడ్డాయి! ఇక పటవుడీ, బోర్డెలు కుంటుపడి చిన్న చిన్న ఒకట్లు ఎన్నో వదులుకున్నారు. చిన్న మొత్తాలు కలిస్తేనే కదా పెద్ద మొత్తం అయ్యేది!

ఇక బవులింగ్ సంగతి. మనవాళ్లు 2517 పరుగులకీ 70 వికెట్లు పడగొట్టారు. అందులో 5 శతాలూ, 9 సున్నాలూ. ప్రారంభంలోనే అతి విసురు పనికి రాదు కాని అదేపని చేశారు. పడిన విక్కెట్లు కాస్త ఆస్ట్రేలియన్ల అజాగ్రత్తవల్ల పడినవే. అంతేకాని, మనవారి ప్రతాపంవల్ల కానేకాదు.

ఇక్కడ ఒక విషయం గమనించాలి. 'స్పిన్' వల్లనే కలిగాయి మన లాభాలన్నీ. మయిసూరునుంచి వచ్చిన ప్రసన్న ఇందులో



ప్లాస్టిక్ ద్రవ్యంతో పోతపోసిన, ఎంత బరువునైనా మోయగల, ఎండ, వాన లకు చెక్కుచెదరని ఈ కుర్చీలని పశ్చిమ జర్మనీలో తయారు చేస్తున్నారు.

ఆరితేరినవాడు. ఎందరో గొప్ప ఆటగాళ్ల పని పట్టించేశాడు ఈ పొట్టి ప్లేయర్! ఫీల్డింగ్ సంగతి చెప్పనే అక్కరలేదు ఎన్నో క్యాచ్‌లు వదులుకున్నారు మనవాళ్లు.

మన జట్టు కాప్టెన్‌ని తెగపొగిడేస్తూ వచ్చారు చాలామంది కొంతకాలంగా ఇంతకీ ఇతను సాధించింది ఏమిటి? మంచి నాయకుడు కాడు. 24 టెస్ట్‌మాచ్‌లలో 12 ఓడిపోయాడు, 10 డ్రా చేశాడు, 2 గెలిచాడు. జూదరిలాగ ప్రవర్తిస్తాడు గాని తెలివిగా ఆలోచించేట్టు కనిపించదు పొటవుడీ. లేకపోతే ముందు ఆస్ట్రేలియాని బాటింగుకి పంపేవాడా? ఎంత యువకుడయినప్పటికీ ఇంత అనుభవం వచ్చినతర్వాత కూడా ఇలా ప్రవర్తిస్తే ఎలాగ?

ఏమాటకి ఆమాటే చెప్పుకోవాలి. ఉపాయంలో కొరత చూపించినప్పటికీ పొటవుడీ ఉజ్వలంగా బాట్ చేస్తాడు. ఒక కన్ను సరిగ్గా లేనప్పటికీ, కాలుదెబ్బ తిన్నప్పటికీ చక్కగా, నిదానంగా ఆడ్తాడు. ఎటువంటి బవులింగుకీ భయపడడు. అందుకనే అతన్ని అందరూ 'పులి' అంటారు. ఏ జట్టుకయినా కీర్తి తీసుకురాగలడు ఈ నవాబు.

సూర్తి, వడేకర్‌లు ఇద్దరూ బ్రహ్మాండగా ఆడారు. వడేకర్ అదృష్టం మాత్రం అంత బాగాలేదు; కొంచెం నిలకడ అలవరుచుకోటం కూడా అవసరమే అనిపిస్తుంది మనకి. ఇంజనీర్ విషయంలోనూ ఇదే విమర్శ అవసరం. అనవసరంగా హడావుడి పడిపోతాడు మనిషి.

అబిద్‌అలీ అందరిలో చిన్నవాడు. టెస్ట్ మాచ్‌ల స్థాయిలో ఆడటం మొదటిసారి ఎంత బాగాఆడాడు! 55 పరుగులకి 6 వికెట్లు పడగొట్టాడు. నాలుగు క్యాచ్‌లు పట్టుకుని తన అప్రమత్తతని నిరూపించాడు నిర్భయంగా 299 పరుగులు చేశాడు.

బోర్డ్‌ని ఎంతోకాలంగా పెద్ద ఆటగానిగా తయారు చేస్తూవచ్చారు. చివరికి అతని బండారం బయట పడింది. ఎడెలెయిడ్‌లో 69, బ్రిస్‌బేన్‌లో 63 చేశాడు కాని ఇది పయిమెరుగే. అసలు ఇంగ్లండులో జరిగినదంతా చూసి తనకి తానే మానుకుని ఉండాలి, ఎన్నిక చేసే వారిదాకా రానివ్వకుండా సర్దేశాయికూడా ఇంటికి తిరిగివచ్చే విమానంలో చంద్రశేఖర్‌కి జతగా ఉండి హనుమంతసింగ్‌కి అవకాశం ఇచ్చివుండాలి. వెంకటరాఘవన్, అమరనాథ్‌లకి కూడా అవకాశం ఇచ్చి ఉండలి.

మన జట్టు బలహీనత తెలిసే ఆస్ట్రేలియన్లు చీకూ చింతా లేకుండా ఆడారు. అంతా తమాషా అయిపోయింది వారికి! బాటింగ్‌లోనే కాక బవులింగ్‌లో కూడా తమ ప్రజ్ఞ చూపారు. మనం వారిమీద వాడిన 'స్పిన్'ని మనమీదనే వాడి మనవారిని టపటప పడగొట్టేశారు. ఈ టెస్టు తర్వాత బారీ పింప్సన్ ఆడడుట. ఇది క్రికెట్టుకే పెద్ద నష్టం. మళ్లీ ఆటువంటివాడిని చూడటం ఎప్పుడో! ●



మద్రాసులో 23 వ జాతీయ క్రీడోత్సవాల సందర్భంగా జరిగిన శరీర సౌష్ఠవం పోటీలలో గెలుపొంది 'భారత్ శ్రీ-1967' బిరుదుపొందిన శ్రీ ఎస్. సమంత (సర్వీసెస్)

# రంజీ ట్రాఫీలో సర్వీసెస్‌పై మద్రాసు విజయం

మొత్తం 18 సంవత్సరాలు, వరుసగా గత 9 ఏళ్ల నుంచి రంజీ ట్రాఫీలో విజయాన్ని సాధిస్తూ వస్తున్న బొంబాయి క్రికెట్ బృందాన్ని 1934నుంచి రెండవసారి మద్రాసు సవాలు చేస్తున్నది. చేపాక్‌లో జరిగిన ఆటలో మద్రాసు సర్వీసెస్‌పై విజయాన్ని సాధించి ఫైనల్స్‌కి వచ్చింది. బొంబాయి జట్టు కలకత్తాలో జరిగిన పోటీలో మొదటి యిన్నింగ్ పాయింట్లలోనే బెంగాలు జట్టుని ఓడించింది. కలకత్తాలో ఆడిన ఆటలో ఎస్. ఎస్. నాయక్, స్క్వప్పర్ హార్డికర్‌లు బొంబాయికి శతాల్ని సాధించారు. ఎస్. ఎస్. మిత్రా సాధించిన 104 పరుగులు బెంగాలుని మరీ ఘోరపరాజయం పాలుకాకుండా కాపాడింది.

భారతదేశం తరఫున న్యూజిలాండ్‌లో ఆడుతున్న ప్రముఖ ఆటగాళ్ల అయిదుగురి సహాయం తమకి లేకపోయినా బాటింగ్‌లో తమను మించటం మద్రాసు జట్టుకి సాధ్యం కాదని బొంబాయి అభిప్రాయపడుతున్నది. అయినప్పటికీ వి. వి. కుమార్, ఎస్. వెంకటరాఘవన్‌లే కాకుండా మైసూరు జంట ప్రసన్న, చంద్రశేఖర్‌కి సమఉజ్జీ అయిన నాజమ్ హుస్సేన్ స్పిన్ బవులింగ్ మద్రాసుకి పెద్ద అండ. కె. ఆర్. రాజగోపాల్, స్క్వప్పర్ బెల్లియప్ప మధ్య ప్రదేశ్‌తో జరిగిన ఆటలో శతాల్ని సాధించారు మిల్కా సింగ్ సర్వీసెస్ ధాటికి నిలువలేక పోయాడు.

సర్వీసెస్ నాయకుడు కె. టి. డేవీ టాస్ గెలిచాడు. 13కి మూడు దగ్గర మద్రాసు ప్రారంభ బవులర్ సి. కె. భాస్కర్ వారి అవకాశాలని వమ్ము చేశాడు. చక్కని కాచ్ కూడా అందుకు సహకరించింది. కుమార్ బవులింగ్ డేవీ ఆటని 93వద్ద ఆపేసింది. అతను కూడా శతాన్ని సాధించతగినవాడే. 213 చేసినా మద్రాసు స్పిన్ బవులింగ్ ధాటికి వారు నిలవలేక పోయారు.

సురేంద్రనాథ్, చక్రవర్తి, డేవీల ధాటికి మద్రాసుకి ముందుకి పోవడానికి సాధ్యం కాలేదు. 4కి 116 ఉన్నప్పుడు సత్‌మెందర్‌సింగ్ రంగంలోకి దూకి 74 సాధించి పెట్టాడు మద్రాసుకి. శతాన్ని సాధించవలసిన అతను తొందరపాటు కారణంగా తప్పిపోయాడు.

నజామ్ హుస్సేన్, డార్వీలు అతనికి సహకారాన్నిచ్చారు. డార్వీ 71 నిమిషాలలో 76 పరుగులు చేశాడు. నజామ్‌హుస్సేన్ ఫీల్డింగ్ అద్భుతమే కానీ తన తొందరపాటు కారణంగా 40కి మించకలేక పోయాడు. అందువల్లనే 73 కన్నా ఎక్కువ పరుగులతో ఘన విజయాన్ని సాధించి ఉండాల్సింది కాస్తా తప్పిపోయింది.

సర్వీసెస్ గ్రౌండ్ ఫీల్డింగ్ అద్భుతంగా ఉంది. కానీ ముఖ్యంగా రెండవ ఇన్నింగ్స్‌లో కాచ్ అంతంతమాత్రంగానే ఉంది. మొదటి ఇన్నింగ్స్‌లో మద్రాసు తమనిమించి పోవడాన్నిచూసి సర్వీసెస్ కించపడినట్లు నాకు అనిపించింది. ఆశ్చర్యాన్ని కలిగించే రీతిలో 145 పరుగుల చిన్న మొత్తానికి సర్వీసెస్ ఆటని విరమింపజేశారు. నాలుగో ఇన్నింగ్‌లో విజృంభించి వారు త్వరత్వరగా ఎక్కువ పరుగుల్ని సాధిస్తారని అనుకున్నానే కానీ, నిరుత్సాహపడ్డాను. డేవీ కూడా అసహనంతో బాధపడుతున్నట్లు కనిపించాడు. 13 కే అతను నిష్క్రమించాడు, చక్కని మద్రాసు బవులర్ వెంకటరాఘవన్ తన 4 వికెట్లతో రంజీ ట్రాఫీ కాలంలో మొత్తం 43 వికెట్లు రికార్డు సాధించాడు.

మద్రాసు కూడా భయం భయంగానే బాట్ చేసింది. డార్వీ 76 కొట్టకముందు సర్వీసెస్ విజృంభించేలా కనిపించింది. అప్పటికే మూడు వికెట్లు నష్టం అయినాయి వెంకట్రాఘవన్ గెలుపును సాధించేలా కొట్టాడు. అతను 32 సాధించాడు. అవుటు కాలేదు. అనాడు 3 కి 30 వద్ద ఉండిపోకుండా బాలాజీ రావు అతనికి తోడ్పడ్డాడు. మద్రాసు స్పిన్నర్‌ల ప్రతిభకి తట్టుకుని సర్వీసెస్ విజృంభిస్తారని నేను అనుకున్నాను. అయినా మద్రాసు బాట్స్‌మెన్ కూడా యింకా ప్రతిభావంతంగా ఆడి ఉండాల్సింది.

* * *

ఫిబ్రవరి 8న మద్రాసులో జపాన్ టెన్నిస్ ఆటగాళ్ల ఇన్విటేషన్ టోర్నమెంట్‌లో అద్భుత ప్రదర్శననిచ్చారు. ఆ అమోఘమైన ప్రదర్శన వివరాలు వచ్చేవారం చర్చిస్తాను.

—కె. ఎస్. నరసింహన్

Edited, Printed and Published by S. Radhakrishna at the Andhra Patrika Press: 6 & 7, Thambu Chetty Street, Madras-1. Chief Editor: S. Sambhu Prasad.